# కళ్ళు మూసుకో ఏమికావాలో కోరుకో



మీరు పొదుపువేసితే మీ కోర్కెలు నిజమవుతాయి. సైకిలా! బొమ్మరిల్లా! ఆటవస్తువా! ఏదయినా మీ డబ్బుతో మీరే కొనుక్కోవచ్చును. కెనరా బ్యాంక్ **బాల క్షేమనిధి** మీ కోసమే! అందమయిన **బాల క్షేమనిధి** పెట్టె మీ పైసలు దాచుకోవడానికి బాగుంటుంది. దానికి తాళము కూడ వేసుకోవచ్చును. మీ పెట్టె నిండగానే దగ్గిరగా వున్న కెనరా బ్యాంకులో డబ్బును జమచేసి తిరిగి దానిలో కూడబెట్టవచ్చును. మీ డబ్బు పెరుగుతూ వుంటుంది. ఎందుకంటే మేముకూడ కొంత మొత్తము కలుపుతాము కనుక. త్వరలోనే ఆ మొత్తము మీరు కోరుకొనిన వస్తువు కొనుక్కోటానికి సరిపోతుంది. మీ కోర్కెలు తీరడానికి ఏలాంటి గొప్ప పద్ధతో చూశారా! పొదుపు చేయడానికి యెంతటి అద్భుతమయిన పద్ధతో చూశారా!

మీకు దగ్గిరలోనున్న కెనరా బ్యాంక్ శాఖకి వెళ్ళి వివరములను తెలుసుకోండి.

మా యితర ప్రత్యేక ప్రణాళికలు

**కామధేను, నిరంతర, విద్యానిధి.**

## బాలక్షేమ నిధి




## కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200కు పైగా శాఖలు దేశమంతటా కలవు.

maa CB 4 Tel 80



# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [''సరైన నిర్ణయం'']కు ఆధారం పి. వి. వి. కె. సుబ్బారావు రచన.

ధానధర్మాలమీద ఆధారపడి జీవించే సాధుసన్యాసులకూ, కుంటీ,గుడ్డీ పేదలకూ మధ్య వుండే తేడా, ''నిజమైనభోక్తలు'' అన్న కథలో మనం చూస్తాం. అపాత్రదానం అపహాస్యానికి గురిఅవుతుంది.

## అమరవాణి

ప్రమాణాదధికస్యాపి, గండశ్యామమదచ్యుతేః,
పదం మూర్ధ్నిసమాధత్తే, కేసరీ మత్తదంతినః.

[ఏనుగు స్వరూప, బలాల్లో అధికురాలైనా, సాహస పరాక్రమాలు కలది గనక చిన్నదైనా సింహం, దాని కుంభస్థలాన్ని బద్దలు కొట్టగలుగుతున్నది.]


సంపుటి 67 నవంబర్ '80 సంచిక 5

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00







ఎమ్. వాసుదేవమూర్తి, ఖమ్మం (ఆంధ్ర)

ప్ర: వారములు ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని—ఇవి ఎటుల పుట్టినవి ?

న: ఏడు రోజుల వారం సహజమైన కాలమానం కాదు. ప్రపంచమంతటా అమలులో ఉన్న ఈ ఏడు వారాల పేర్లు ఒక నాగరికత నుంచే పుట్టి వుండవచ్చు. దీనికి ఊహించదగిన కారణాలు అనేకంగా ఉన్నాయి. ఒకటి, మన పూర్వులకు ఏడు సంఖ్య పవిత్రమైనది—సప్తర్షులు, సప్తహోతలు, సూర్యుడి సప్తాశ్వాలు, సప్తమాతృకలు, సప్తసముద్రాలూ వగైరా. రెండు, ప్రాచీన ఖగోళశాస్త్రజ్ఞులు ఏడు గ్రహాలను గుర్తించారు—రవి, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శనులు. ఈ పేర్లే వారాలకు పెట్టారేమో. ఈనాడు మనం రవిని గ్రహకక్షకు కేంద్రంగానూ, చంద్రుణ్ణి ఉపగ్రహంగానూ భావిస్తున్నాం. అయినా వారాల పేర్లు మారలేదు. (వారం అంటే అసలు అర్థం రోజు. మనం వారం అనేది ఏడు రోజుల రోజు.)

శ్రీనందా, బెంగుళూరు

ప్ర: ఆకాశగంగ (క్షీరపథం, పాలవెల్లి) అంటే ఏమి ?

న: ఆకాశంలో నక్షత్రాలు గుంపులు కట్టి ఉంటాయి. మనం సూర్యకుటుంబంలో ఉన్నాం. సూర్యుడులాంటి నక్షత్రాలు కొన్ని వేల కోట్లు ఒక బ్రహ్మాండంగా ఉన్నది. అదే పాలవెల్లి. సూర్యుడు పాలవెల్లి కేంద్రానికి దూరంగా ఉన్నది. మనం కేంద్రం దిక్కుగా చూసినప్పుడు హెచ్చు నక్షత్రాలు కేంద్రీకరించి ఉండటం కనబడుతుంది. దానినే పాలపుంత అంటారు.

ఎం. సుకుమార్ జైన్, శివమొగ్గ (కర్నాటక)

ప్ర: చంద్రుడు మనకు గోళంగా కనిపిస్తూ, వెలుగు కలిగించినట్టు భూమి చంద్రగోళానికి కనిపిస్తుందా ?

న: కనిపిస్తుంది. చంద్రుడి దిక్కునుంచి భూమిని రంగులలో ఫొటో తీశారు కూడా. చంద్రుడి కన్న భూమి చాలా పెద్దది గనక భూమి చంద్రుడి మీదినుంచి చూస్తే చాలా పెద్దదిగా కనిపిస్తుంది. మనకు అమావాస్య అయిన నాడు చంద్రుడికి పూర్ణిమ ; అంటే భూమి పూర్ణబింబంగా, అమిత కాంతివంతంగా చంద్రుడి మీద వున్నవారికి కనిపిస్తుంది.




# 89

మేఘవర్ణుడూ, ఇతర కాకులూ పెట్టిన కేకలకు నీటిపక్షులు బెదిరి, కోటను విడిచి పారిపోయి, అగడ్తలలో చేరాయి.

చిత్రవర్ణుడి సేనాపతి అయిన కోడి పుంజు హిరణ్యగర్భుణ్ణీ, అతని సేనాపతి అయిన సారసుణ్ణీ చుట్టుముట్టి, హింసించింది. సారసుడు తనను రక్షించబోయినప్పుడు హిరణ్యగర్భుడు, "నా పాట్లు నన్ను పడనీ, నా కొడుకు చూడామణిని రాజుగా అభిషేకించు," అన్నది.

"నా బొందిలో ప్రాణం ఉండగా శత్రువులు తమరికి హాని చెయ్యలేరు," అంటూ సారసుడు, కోడిపుంజు ప్రయత్నాలను విఫలంచేసి, హిరణ్యగర్భుణ్ణి అగడ్తలోకి తోసేసింది. తరవాత అది కోడిపుంజుతో హోరాహోరి యుద్ధంచేసి, చంపేసింది. అయితే నేలపక్షులు ఒక్కుమ్మడిగా దాని మీద పడి, కొంగను కూడా చంపాయి.

యుద్ధం చిత్రవర్ణుడి విజయంతో ముగిసింది. జయజయ ధ్వానాల మధ్య అది కోటలో ప్రవేశించింది.

## శాంతి

"మన కోటలోని ఇళ్ళ మీద మండే కొరవులు పడేసినది ఎవరు? శత్రువులా, లేక శత్రువు నియోగించిన కోటలోని వాళ్ళా?" అని హిరణ్యగర్భుడు తన అనుచరులను అడిగింది.

"తమ అవ్యాజమిత్రుడు మేఘవర్ణుడూ, అతని అనుచరులూ కానరారు. ఆ పని చేసినది వాళ్ళే అనుకుంటాను," అన్నది సర్వజ్ఞుడు.

"అంతా మన ప్రారబ్ధం! మన దురదృష్టం!" అన్నది రాజు.

''దురదృష్టాన్ని ఎందుకు నిందించటం? సరిఅయిన హితం విననివాళ్ళు కష్టాలపాలవుతారు,'' అన్నది సర్వజ్ఞుడు.

ఇంతలో ఒక దూత ద్వారా వార్త వచ్చింది: కర్పూరద్వీపం ఓడిపోవటానికి సహకరించినందుకు మేఘవర్ణుడు (కాకి)ని రాజుగా చేస్తానని చిత్రవర్ణుడు అంటే, దూరదర్శనుడు ఒప్పుకోక, నీచుణ్ణి బాధ్యతగల స్థానంలో ఉంచరాదనీ, దానికి బహుమతులు ఇయ్యమనీ అన్నదట! కాకిని రాజు చేస్తే, తనకు రోజూ కాశ్మీరుశాలువలూ, కుంకంపువ్వూ, ఫలాలూ పంపుతూ ఉంటుందని చిత్రవర్ణుడు అంటే, దురాశలకు పోవద్దని గద్ద హెచ్చరించిందట!

''అయితే నన్ను ఏం చెయ్యమంటావు?'' అని నెమలిరాజు గద్దను అడిగింది.

''హంసరాజుతో శాంతి ఒడంబడిక చేసుకుని, వింధ్యకు తిరిగివెళ్లు. వర్షాలు ఆరంభమయేదాకా ఇక్కడే తాత్సారం చేశామంటే, మరొక యుద్ధం జరిగి, నష్టపోతాం. కోటను జయించామన్న కీర్తి ఎటూ రానేవచ్చింది. ఆ కాస్తా ఎందుకు పోగొట్టుకోవాలి? ఉభయ పక్షాలు సమబలం గలవి అయినప్పుడు ఒక్కొసారి యుద్ధంలో రెంటికీ నాశనం కలుగుతుంది. అందుచేత మనకు ఏ మాత్రం తీసిపోని హిరణ్యగర్భుడితో సంధి చేసుకుందాం,'' అన్నది గద్ద.



విజయగర్వం మీద ఉన్న చిత్రవర్ణుడికి ఓడిన శత్రువుతో సంధీ, శాశ్వత సఖ్యమూ చేసుకోవటం మొదట నచ్చలేదు.

అందుచేత హిరణ్యగర్భుడి మంత్రి జంబూద్వీపానికి తమ కొత్త సేనాని అయిన సారసుడి కొడుకును పంపి, అక్కడ అరాజకం కలిగించి, సింహళ ద్వీపాన్ని, జంబూద్వీపం మీద యుద్ధానికి వెళ్ళేటట్టు పురికొల్పించింది.

గద్ద నెమలి రాజుతో మేఘవర్ణుణ్ణి (కాకిని) సలహా అడగమన్నది. హంస రాజుతో సంధి చేసుకోమని సలహా ఇస్తూ, "ఆ రాజూ, మంత్రీ కూడా చాలా దొడ్డ బుద్ధిగల వాళ్ళు," అన్నది కాకి.

"అలా అయితే నువు ఆ రాజునూ, మంత్రినీ ఎలా మోసగించగలిగావు?" అని నెమలిరాజు కాకిని అడిగింది.

"ప్రభూ, నిన్ను విశ్వసించిన మహాత్ములను వంచించటంలో ఘనత ఏమున్నది? నీ ఒడిలో నిద్రించేవాణ్ణి చంపటంలాటిదే! సజ్జనుడు దుర్మార్గుణ్ణి తనలాంటి వాడుగానే భావించి నమ్మినప్పుడు మోసగించటం తేలిక. అంత మాత్రాన నేను చెప్పినది మంచిసలహా కాకపోదు," అన్నది కాకి.

"మేఘవర్ణా, నువు వారిమధ్య అంత కాలం వారికి విధేయత చూపుతూ ఎలా ఉండగలిగావు?" అని నెమలిరాజు కాకిని మళ్ళీ అడిగింది.



"నా పని పూర్తి కాగలందులకు ఉండక తప్పలేదు. నా మాటవిని హిరణ్య గర్భుడితో సంధి చేసుకోండి," అన్నది కాకి.

సర్వజ్ఞుడు ఇందుకు సమ్మతించింది.

"నాకు ఓడిపోయిన హంసరాజు కనీసం నాకు కప్పం కట్టుతూ, నా ఆజ్ఞలకు లోబడి ఉండనీ," అన్నది నెమలి రాజు.

అంతలో, జంబూద్వీపం నుంచి వచ్చిన చిలక నెమలిరాజుతో, సింహళద్వీప రాజు కొక్కొరాయి, జంబూద్వీపం మీద దాడి చేసినట్టు చెప్పింది.

"మంచి పని చేశావు, సర్వజ్ఞా!" అన్నది గద్ద ఉత్సాహంగా.

"నేను వెంటనే వింధ్యకు వెళ్ళి, ఆ కొక్కొరాయి అంతు తేల్చుతాను." అన్నది నెమలి రాజు.

"ప్రభూ, ఆగ్రహించి లాభం లేదు. సరిగా ఆలోచించకుండా చేసే పనులు ఆపద కలిగిస్తాయి," అన్నది సర్వజ్ఞుడు.

నెమలిరాజుకు ఈ మాట నిజమని పించింది. అది గద్దను శాంతి సంధి ఏర్పాటు చేయమన్నది. దూరదర్శనుడు హిరణ్యగర్భుడి వద్దకు శాంతి రాయబారిగా వెళ్ళింది.

హిరణ్యగర్భుడు సర్వజ్ఞుణ్ణి, "ఇది మళ్ళీ ఒక దొంగ ఎత్తా?" అని అడిగింది.

"కాదు! గద్ద దొడ్డబుద్ధి గలది. దాన్ని కానుకలతో ఆహ్వానింతాం," అన్నది సర్వజ్ఞుడు.

గద్ద సర్వజ్ఞుడితో, "మనం ఇద్దరు రాజుల మధ్యా శాంతి నెలకొల్పుదాం. వెయ్యి అశ్వమేధాల కన్న సత్యం మీద ఆధారపడిన శాంతి మేలు," అన్నది.

సర్వజ్ఞుడు ఇందుకు సంతోషంగా ఒప్పుకున్నది. ఉభయపక్షాల మధ్యా శాంతి సంధి జరిగింది. అటు తరవాత చిత్రవర్ణుడు జంబూద్వీపంలోనూ, హిరణ్యగర్భుడు కర్పూరద్వీపంలోనూ, మేఘవర్ణుడు సింహళంలోనూ రాజ్యం చేశాయి. —(అయిపోయింది.)






## 7

[తూర్పుతీరంలో వున్న తమ పడవలను చేరేందుకు బయలుదేరిన సమరసేనుడూ, సైనికులూ అగ్నిపర్వతం మంటల కారణంగా, మరొక దిక్కు కేసి పోసాగారు. దారిలో వాళ్ళకు చెట్టు నుంచి తలకిందులుగా వేళ్ళాడుతున్న ఆటవికుడు కనిపించాడు. అక్కడ వున్న మనుషుల కాలిగుర్తులు, ఏనుగుల పాదాల కింద నలిగి కనిపించకుండా పోయినై. తరవాత—]

సమరసేనుడు, సైనికులకు ధైర్యం చెప్పి మరొక సారి తాను లోగడ చూసిన రాళ్ళ దిబ్బ కేసి వెళ్ళాడు. ఆ ఎత్తయిన దిబ్బ మీది నుంచి చూస్తే, దాపులనున్న ఏవైనా ఆటవికుల ఇళ్ళలాటివి కనబడతవేమో అని అతడి ఆశ. కాని, ఎక్కడా అతడికి మానవ నివాసాలు కనిపించలేదు. ఇప్పుడు ఏం చేయాలి? ఏ మార్గం అనుసరించాలి? సమరసేనుణ్ణీ, సైనికులను కూడా యివే ప్రశ్నలు బాధిస్తున్నవి. సమరసేనుడు ఒక చెట్టుబోదెకు ఆనుకు నిలబడి ముందు కర్తవ్యం గురించి ఆలోచించసాగాడు. ఎంత ఆలోచించినా అతడికి ఒక దారీ తెన్నూ కనిపించటం లేదు.

ఇలాంటి స్థితిలో వాళ్ళందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసే, ఆర్తనాదం ఒకటి వినిపించింది. ఆ గొంతు ఏకాక్షదీ కాదు, చతుర్నేత్రుడిదీ కాదు. ఘోర విపత్తులో



క్షణంలోనే ఏదో ఆశలాంటిది వాళ్ళకు ఉత్సాహాన్నిచ్చింది. ఈ భయంకర మాంత్రికుల దీవిలో, వాళ్ళు మొట్ట మొదటి సారిగా జీవంతో వున్న మనిషిని చూడగలిగారు. కాని, వాడు పెద్ద విపత్తులో చిక్కుకుని వున్నాడు.

ఎవరో వాణ్ణి పెడరెక్కలు విరిచి చెట్టుకు కట్టిపోయారు. అలాంటి నిస్సహాయ స్థితిలో వున్న అతడిని తినేందుకు నాలుగైదు తోడేళ్ళు అక్కడికి వచ్చినై. అదే సమయంలో ఆకలిగొన్న ఒక పెద్ద పులి కూడా అటుకేసి వచ్చింది. ఇప్పుడు ఆ దురదృష్టవంతుడి మాంసం కోసం తోడేళ్ళ మధ్యా, పెద్దపులి మధ్యా పోరాటం సాగుతున్నది. భయకంపితుడైన ఆ మనిషి గగ్గోలు పెడుతున్నాడు.

సమరసేనుడు క్షణంలో పరిస్థితి అవగాహన చేసుకున్నాడు. పులి పంజా దెబ్బలకు ఒక్కొక్క తోడేలే అరుస్తూ కింద పడిపోతున్నది. ఆ విధంగా శత్రు సంహారం చేసి, తరవాత తీరిగ్గా మనిషి మాంసం రుచి చూడాలని పులి పోరాడుతున్నది. సమరసేనుడు బాణం ఎక్కుపెట్టి పులిని గురిచూసి కొట్టాడు. ఆ దెబ్బకు పులి బొబ్బరిస్తూ కింద పడింది.

వెంటనే సైనికులు ముందుకు ఉరికారు. ఆకలిగొన్న తోడేళ్ళు అరుస్తూ

వున్న ఒక మానవప్రాణి చేస్తున్న ఆర్తనాదం.

సైనికులు నివ్వెరపోయి తమ నాయకుడి కేసి చూశారు. సమరసేనుడు తృటిలో ఒరనుంచి కత్తి దూసి, "రండి, జాగ్రత్త సుమా!" అంటూ, ఆ ఆర్తనాదం వినబడిన వైపుకు పరిగెత్తసాగాడు.

సైనికులు కూడా కత్తులు దూసి తమ నాయకుణ్ణి అనుసరించారు. వాళ్ళు అలా పోతున్న కొద్దీ, ఆ మానవ కంఠం మరింత స్పష్టంగా వినబడసాగింది. కొద్ది సేపటికల్లా వాళ్ళు, ఆ ప్రదేశం చేరారు. అక్కడ కంటబడిన ఘోర దృశ్యం వాళ్ళను భయకంపితులనుచేసింది. మరు

వాళ్ళమీదికి దూకినై. సైనికులు తొణక కుండా తమ చేతనున్న కత్తులతో, వాటిని నరికివేశారు. అంతలో సమరసేనుడు అక్కడికి వచ్చి, చెట్టుకు బంధింపబడిన మనిషి కట్లు విప్పాడు.

"నన్ను ప్రాణాపాయం నుంచి కాపాడిన మీరు నిజంగా మహానుభావులు. మీ మేలు ఎన్నటికీ మరవలేను!" అంటూ అతడు సమరసేనుడికీ, సైనికులకూ నమస్కరించాడు.

ఆ మనిషి రూపురేఖలూ, మాట్లాడిన తీరూ చూడగా సమరసేనుడికి అమితాశ్చర్యం కలిగింది. ఇతడు, యీ మంత్రాల దీవి వాడు కాదని వెంటనే అతడు గ్రహించాడు. ఎందుకనో ఆ మనిషి కుండలినీ ద్వీపవాసి అయి వుండవచ్చునన్న అనుమానం కలిగింది సమరసేనుడికి.

"నువు ఏ దేశస్థుడివి?" అని అడిగాడు సమరసేనుడు.

"నేను....కుండలినీ ద్వీప సైనికుణ్ణి. ఆ రాజ్య సేనానాయకులైన సమరసేనుడు మీరే కదా?" అని ఆ వ్యక్తి సమరసేనుణ్ణి అడిగాడు.

సమరసేనుడికీ, సైనికులకూ ఆ ప్రశ్న వింటూనే కలిగిన ఆశ్చర్యం అంతాయింతా కాదు. ఈ కొత్తవాడు తమతోపాటు ఓడలలో బయలుదేరి వచ్చినవాడు కాదని






అందరికీ తెలుసు. అయితే యితడు యీ ద్వీపానికి ఎప్పుడు వచ్చినట్టు ?

ఆ కొత్త సైనికుడు, వీళ్ళ మనోభావాలు గుర్తించిన వాడిలా యిలా చెప్పసాగాడు :

మీరు ఆనాడు ఓడలలో బయలుదేరే టప్పుడు తోకచుక్క కనిపించింది గదా? అయినా మీరు ఆస్థానదైవజ్ఞుడి సలహా పాటించకుండా బయలుదేరి పోయారు. ఆ తరవాత కొద్దిసేపటికి పెద్ద తుఫాను ప్రారంభమై, సముద్రం అల్లకల్లోలం రాజొచ్చింది. చిత్రసేన మహారాజు చాలా కలవర పడ్డారు. వరసగా మీ క్షేమం కోసం నాలుగైదు రోజులు కుండలినీ దేవికి పూజలూ, ఉత్సవాలూ చేయించారు.

కాని, తుఫాను వారం రోజుల పాటు భయంకరంగా వీచింది. మీరు ఏమై పోయారో అని రాజుగారూ, ప్రజలూ దిగులు పడిపోయారు.

చివరకు చిత్రసేన మహారాజుగారు ఆస్థాన దైవజ్ఞుడి చేత అంజనం వేయించి, మీరు ఎక్కడ, ఏ స్థితిలో ఉన్నారో తెలుసుకోదలిచారు. ఒక శుభముహూర్తాన దైవజ్ఞుడు అంజనం వేసి చూశాడు. ఓడలు మునిగిపోగా, మిగిలిన కొద్దిమందీ ఒకానొక ద్వీపం చేరినట్టు తెలిసింది.

చిత్రసేన మహారాజు, మంత్రిసామంతులతో సమాలోచన జరిపారు. కొద్దిమంది సైనికులతో మీరు ఏదో తెలియని కొత్త ద్వీపానికి చేరటం వల్ల, మీ అందరికీ ముప్పు కలిగే అవకాశం వున్నదని నిర్ణయించుకున్నారు. తరవాత వారం రోజుల్లో మరికొందరు సైనికులను పోగుచేసి కుంభాండుడి నాయకత్వం కింద మిమ్మల్ని వెతికేందుకు పంపారు.

కొత్త సైనికుడు యింతవరకు చెప్పగానే, సమరసేనుడు కనుబొమలు ముడిచి, ''ఎవరీ, కుంభాండుడు?'' అని అంతలోనే ఏదో గుర్తు వచ్చి ''ఓహోఁ, కుంభాండ సంస్థానాధిపతా?'' అన్నాడు.

''అవును, వాడే! వాడి వల్లనే, నేను యీ ప్రాణాపాయస్థితిలో చిక్కుకోవటం

జరిగింది,'' అన్నాడు కొత్త సైనికుడు పళ్ళు కొరుకుతూ.

సమరసేనుడు, సైనికుడి మాటలు వింటూనే నివ్వెరపోయాడు. పక్కనవున్న సైనికులకు యిదేమీ అర్థంకాలేదు. తిరిగి ఆ కొత్త సైనికుడు యిలా చెప్పాడు :

ఓడలలో బయలుదేరిన మేము కొద్ది రోజులకల్లా, యీ ద్వీపం చూశాం. ద్వీప దక్షిణప్రాంతంలో ఓడలు దిగి, తీరం చేరాం. కుంభాండుడు మమ్ములనందరినీ, తీరం దగ్గిరేవుండమని, యిద్దరు సైనికులతో ద్వీపంలోకి బయలుదేరాడు.

ఆ రోజల్లా మేం అతడిరాక కోసం ఎదురుచూస్తూ, కాలంగడిపాం. మరసటి రోజు తెల్లవారిన తరవాత కుంభాండుడు ఒంటరిగా తిరిగి వచ్చాడు. కారణం ఏమిటో సరిగా చెప్పక, యిది నా ఆజ్ఞ అంటూ, మా దగ్గిరవున్న విల్లంబులూ అవీ తీసుకుని, కట్టకట్టించి, సముద్రంలో పారవేయించాడు. ఎంత ఆలోచించినా, కుంభాండుడి యీ వింత చర్యకు కారణం ఏమిటో మాకు అర్థంకాలేదు. పైగా, అతడి వెంట ద్వీపంలోకి వెళ్ళిన ఇద్దరు సైనికులు ఏమైపోయిందీ మాకు తెలియదు. గుచ్చిగుచ్చి అడగగా, వాళ్ళను ఏదో అడవి జాతివాళ్ళు చంపేశారని, కుంభాండుడు చెప్పాడు.



ఈ జవాబుతో మా అందరికీ అనుమానం కలిగి, విల్లంబులను కట్టకట్టి సముద్రంలో ఎందుకు పారవేయించావని కుంభాడుణ్ణి నిలదీసి అడిగాం. దానికి కుంభాడుడు రెచ్చిపోయి, సేనానాయకుడుగా తాను ఏం చేసినా, ఎవరూ ప్రశ్నించకూడదని కఠినంగా జవాబిచ్చాడు.

సమరసేనుడు, కొత్త సైనికుడి మాటలకు అడ్డొస్తూ, '' అయితే, కుంభాండుడు కూడా తన విల్లంబులను సముద్రంలో పారవేశాడా ?'' అని అడిగాడు.

'' సేనానీ, అదే చోద్యం ! తన విల్లంబులు మాత్రం తన వద్దనే వుంచుకున్నాడు. ఆ తరవాత కొద్దిసేపటికల్లా



డాళ్ళూ, ఈటెలూ పట్టిన కొంతమంది ఆటవికులు, భయంకరంగా అరుస్తూ, మా కేసి రాసాగారు. మా దగ్గిర ఆయుధాలేం లేవు గనక, అక్కడ దొరికిన రాళ్ళతోనూ, విరిచిన చెట్ల కొమ్మలతోనూ ఆత్మరక్షణకు పూనుకున్నాం.

కాని, కుంభాండుడు మా అందరినీ, ఆ ఆటవికులకు లొంగిపోవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఈ వింతధోరణి మాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. మాలో అప్పటికే చాలా మంది, ఆటవికుల ఈటె పోట్లకు ఆహుతి అయిపోయారు. మిగిలిన వాళ్ళం, పారిపోయేందుకూ్కడా మార్గం లేక వాళ్ళకు లొంగిపోయాం,'' అన్నాడు సైనికుడు.

''అంత ఘోరమైన పోరు జరుగుతూంటే కుంభాడుడు మీ కేమీ సాయం చేయలేదా ?'' అని అడిగాడు సమరసేనుడు ఆగ్రహావేశంతో.

''అలాంటిదేమీ లేదు. మేం లొంగిపోగానే ఆటవికులు మమ్మల్ని పెడరెక్కలు విరిచి కట్టారు. కుంభాండుణ్ణి ఒక అందలం మీద ఎక్కించారు. దాన్ని కొందరు ఆటవికులు భుజాల మీద ఎత్తుకుని ఉత్సాహంగా కేకలు పెడుతూ, తమ పల్లెల కేసి తీసుకుపోయారు. మేం వాళ్ళకు బందీలుగా వుండిపోయాం. కుంభాండుడు వాళ్ళకు రాజయినట్టు వ్యవహరించసాగాడు. ఆ ఆటవికజాతులకు అతడు ఎంత చెబితే అంత. వాళ్ళమీద యింత అధికారాన్ని కుంభాండుడు ఎలా సంపాయించగలిగాడో మాకు అంతు పట్టలేదు,'' అన్నాడు కొత్త సైనికుడు.

సమరసేనుడు కొంచెం సేపు ఆలోచించి, ''నాకూ అర్థం కావడంలేదు. తరవాత ఏం జరిగింది ?'' అని సైనికుణ్ణి ప్రశ్నించాడు.

''కుంభాండుణ్ణి గురించి మాక్కలిగిన అనుమానాలకు, ఆ తరవాత రెండు, మూడు రోజులకే జవాబు దొరికింది.

ఆటవికులకు విల్లంబులంటే ఏమిటో తెలియదు. మనిషి కదలకుండా ఒక చోట నిలబడి, ఎక్కడో వున్న పక్షినిగాని, జంతువునుగాని బాణంతో కొట్టి చంపటం, వాళ్ళకు గొప్ప మహిమలా కనిపించింది. కుంభాండుడు ఆ మహిమ తన ఒక్కడికే వున్నదని చెప్పుకుని, ఆటవికుల మీద రాజరికం సంపాయించేందుకే, మా విల్లంబులన్నీ కట్టకట్టించి సముద్రంలో పారేయించాడు,'' అన్నాడు సైనికుడు.

''తరవాత ఏం జరిగింది?'' అని అడిగాడు సమరసేనుడు.

''ఒకరోజున అడవి ప్రాంతమంతా తప్పెట మోతలతో మారు మోగి పోయింది. వందలకొద్దీ ఆటవిక జాతుల వాళ్ళు, మేం వుంటున్న పల్లెకు వచ్చారు. వాళ్ళందరి ముందూ యీ కుబుద్ధి కుంభాండుడు తన మహిమ ప్రదర్శించాడు. ఎక్కడో ఆకాశాన ఎగురుతున్న గరుడపక్షిని బాణం దెబ్బతో నేల కూల్చాడు. దూరంగా వున్న ఒక లేడిని బాణంతో పడగొట్టాడు. ఆటవికులు అద్భుత పడిపోతూ, కుంభాండుడి చుట్టూ చేరి నాట్యం చేశారు. వాళ్ళ సాయంతో, తాను యీ మొత్తం ద్వీపానికే రాజు కావాలని కుంభాండుడు ఆశపడుతున్నాడు,'' అన్నాడు సైనికుడు.

సమరసేనుడు చిన్నగా నవ్వి, ''ఇక్కడ పాలించేందుకేముంది? అడవి మృగాలూ, అగ్ని పర్వతాలూ, ఒకళ్ళిద్దరు మాంత్రికులూ!'' అన్నాడు.

''మాంత్రికులా?'' అంటూ సైనికుడు భయకంపితుడైపోతూ చుట్టూ కలయ చూసి, ''వాళ్ళను గురించి ఆటవికులు చెప్పగా విన్నాం. కాని....''

సైనికుడు మరేదో చెప్పబోతున్నంతలో, ''వినటమే గాదు, ప్రత్యక్షంగా చూడనే వచ్చుగదా!'' అన్న కంచుకంఠం ఆ ప్రాంతాల మారుమ్రోగింది. ఆ వెంటనే మాంత్రికుడు చతుర్నేత్రుడు తన కుచ్చుటోపీని చేతబట్టి, వాళ్ళ ముందు ప్రత్యక్షమయాడు. —(ఇంకావుంది)





# సరైన నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ నువ్వు ఇలా శవాన్ని మోయటానికి నిర్ణయించు కున్నందుకు నేను నిన్ను తప్పు పట్టను. కాని రాజుల నిర్ణయాలు ఎల్లప్పుడూ సరిగా ఉండవు. అందుకు నిదర్శనంగా, జ్ఞానశీలు డనే రాజు విచక్షణా రహితంగా ఇద్దరు గజ దొంగలను శిక్షించిన ఉదంతం నీకు చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

జ్ఞానశీలుడు మగధసింహాసనానికి వచ్చే నాటికి, దేశంలో అరాజకం తాండవిస్తున్నది. అవినీతి విజృంభించి పోయింది. ప్రజల జీవితం నరకప్రాయంగా ఉన్నది.

## బేతాళ కథలు



జ్ఞానశీలుడు కేవలమూ దండనీతి ప్రయోగించి, దేశంలో నేరస్థులను అణచి, నేరాల సంఖ్య చాలా వరకు తగ్గించాడు. ప్రజల జీవితం ఒక దారికి వచ్చింది.

కాని జ్ఞానశీలుడి కృషి పూర్తిగా ఫలించలేదు. ఇంకా పెద్ద దొంగతనాలు జరుగుతూనే ఉన్నాయి. అయితే ఇవి సామాన్య ప్రజలను బాధించే దొంగతనాలు కావు. దోపిడీ అవుతున్న వాళ్ళు శ్రీమంతులు. శ్రీమంతులను కొల్లగొట్టిన ధనం నిరుపేదలకు దానం చేయబడుతున్నట్టు రాజుకు తెలియవచ్చింది.

ఇంతేగాక ఈ దొంగతనాలు చేస్తున్న వాళ్ళు ఇద్దరై వుండాలని రాజు ఊహించాడు. ఎందుకంటే ఒకేసారి ఒకే కాలంలో రెండు స్థలాలలో ఎంతో నేర్పుగా దొంగతనాలు జరుగుతున్నాయి. దొంగ ఒకడే అయివుంటే యిలా జరగటం సాధ్యంకాదు.

ఈ దొంగలను పట్టుకోవటం జ్ఞానశీలుడికి తన ప్రప్రథమ కర్తవ్యమనిపించింది. దొంగలు సులువుగా రక్షకభటులకు దొరికే వాళ్ళు కారు. ఏం చేస్తే బావుంటుందని రాజు మంత్రిని సలహా అడిగాడు.

"దొంగలను పట్టి ఇచ్చిన వారికి గొప్ప బహుమానం ఇస్తామని ప్రకటించుదాం. బీదసాదలకు దొంగలు సహాయంగా వుంటున్నారు గనక, వాళ్ళకు దొంగల ఆచూకి తెలిసి ఉండాలి. మనం ఇచ్చే బహుమానానికి ఆశపడి వాళ్ళు దొంగలను పట్టి ఇయ్యవచ్చు!" అన్నాడు మంత్రి.

రాజు ఈ సలహాని నిరాకరిస్తూ, "మనం ఒక్కసారి ఇచ్చే బహుమానం కోసం బీదసాదలు తమకు విడవకుండా సహాయపడుతున్న దొంగలకు ద్రోహం చేస్తారని తోచదు. పేదవాళ్ళలో కృతజ్ఞత బలంగా వుంటుంది. అదీ గాక, ప్రజలకు ధనాశ చూపటం, లంచగొండితనం ప్రజలకు నేర్పటం అవుతుంది. దానితో బాటు మనం మనమై దొంగలను పట్టలేమని

లోకానికి వెల్లడి చేయటమవుతుంది. పేదలు దొంగలను పట్టి ఇయ్యరు! ధని కులు పట్టలేరు! పట్టగలిగితే ఈ దొంగ తనాలు ఇంత విశృంఖలంగా సాగవు. ప్రజల క్షేమం కోరి ఎన్నో పనులు చేశాను. దొంగలను పట్టటం కూడా నా స్వశక్తితోనే జరగాలి,'' అన్నాడు.

దొంగను దొంగే పట్టాలి! రాజు మారు వేషంలో రాత్రిపూట దొంగలాగా సంచ రిస్తూ, దొంగలను గురించి కొన్ని విష యాలు సేకరించాడు. వాళ్ళు ఇద్దరు దొంగలు. రంగన్నా, సింగన్నా అన్నవి వారి పేర్లు. ఇద్దరూ పరువు మర్యాదలు గల కుటుంబాలకు చెందిన వాళ్ళే గాని, అనువాయితీగా దొంగతనాలు చేసే కుటుంబాల వాళ్ళు కారు. దేశం అరాజ కంగా ఉన్న సమయంలో వాళ్ళు దొంగ తనాలకు పూనుకున్నారు.

అటు తరవాత రాజు తన అంగరక్ష కుల సహాయంతో ఇద్దరు దొంగలనూ పట్టుకోగలిగాడు.

రాజు నిండు సభలో వారి విచారణ జరిపాడు. తాము దొంగతనాలు చేసినట్టు ఇద్దరూ ఒప్పుకున్నారు. కాని సింగన్న అనేవాడు ఇలా అన్నాడు:

''మహారాజా, తమరు రాజ్యానికి రాక ముందు మాకు దొంగతనం తప్ప వేరే బతుకు తెరువు లేకపోయింది. అప్పుడు చేసిన దొంగతనాలను గురించి నేను ప్రశ్చాత్తాప పడను. కాని తమ పరిపాల



నలో నేను దొంగతనాలు చేసినది పూర్తిగా స్వార్థంతోనే. చోరవిద్యలో నా నేర్పరితనాన్ని వదులుకోవటం నా కిష్టం లేకపోయింది. నేను దొంగిలించిన డబ్బుతో నేను సుఖంగా బతుకుతూ వస్తున్నాను. కాని ఈ రంగన్న మొదటి నుంచీ పేదలకు సహాయపడుతూ వస్తున్నాడు. వాడు తాను దొంగిలించినది తన సుఖం కోసం ఎప్పుడూ వినియోగించలేదు.''

రాజు ఇద్దరు దొంగలకూ యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, జ్ఞానశీలుడు ఇద్దరు దొంగలలోనూ తేడా తెలిసి కూడా ఇద్దరికీ ఒకే రకం శిక్ష ఎందుకు విధించాడు? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది!'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు దృష్టిలో దొంగల ఆశయంలో తేడాకు విలువ లేదు. ధనికులను దోచి బీదలకు పంచినంత మాత్రాన దేశం సంపన్నం కాదు. అట్టడగు వాళ్ళ పేదరికం సమస్య రాజకీయ చర్యల ద్వారా కాలక్రమాన పరిష్కారం కావలసిందే గాని దొంగతనాల ద్వారా పరిష్కారం కాదు. దేశం అభివృద్ధిలోకి రావటానికి జ్ఞానశీలుడు చేస్తున్న కృషి ఒక వంక మంచి ఫలితాలను చూపుతున్న సమయంలో పేదరికం సమస్యను కృత్రిమంగా పరిష్కరించే దొంగ మూలంగా రాజు కృషికి విలువ లేకుండా పోయింది. కనీసం పేద జనంలో రాజుకన్నా దొంగే చాలా గొప్పవాడన్న భావం వ్యాపించి ఉండాలి. పేదలకు దొంగ తోడ్పడుతున్నాడన్న సంగతి రాజుకు జనంలోనే తెలియ వచ్చింది. ఈ పరిస్థితి రాజు సహించటం సాధ్యం కాదు. అందుచేత రాజు ఇద్దరు దొంగలనూ ఒకే విధంగా శిక్షించటం సరి అయిన నిర్ణయమే!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు —(కల్పితం)



# బతకనేర్పు

వ్యాపారంలో బాగానే గడించి, కలిసిరాక చితికిపోయిన రామయ్యకు తన కొడుకు గురించి బెంగపట్టుకున్నది. కామయ్యకు వ్యాపారానుభవం లేదు. వ్యాపారంలో పెట్టుదామన్నా రామయ్య వ్యాపారం చితికిపోయింది. అందుచేత నగరంలో వ్యాపారం చేస్తూ, ఘనంగా బతుకుతున్న తమ ఊరివాడు, రంగయ్య ఏదో పనిమీద వస్తే, అతనితో రామయ్య తన కొడుకు భవిష్యత్తు గురించి ఆందోళన వ్యక్తంచేశాడు.

రంగయ్య కామయ్యను పిలిచి, "నువ్వు ముందుగా నగరంలో మా యింటికి వెళ్ళి, నా భార్యకు ఈ ఉత్తరం ఇయ్యి. నేను రేపే బయలుదేరి వస్తున్నాను," అన్నాడు.

కామయ్య నగరంలో రంగయ్య ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో రంగయ్య భార్యా, కోడలూ ఉన్నారు. రంగయ్య భార్య కామయ్యకు అన్నంవడ్డిస్తూ, కోడలు లేకుండా చూసి, "నా కోడలు పరమగయ్యాళి, సాయనా! నన్ను తెగకాల్చుకు తింటుంది! ఓనాటికి అది మాత్రం అత్త కాబోదా?" అన్నది.

"రాలిపోతున్న ఆకుల్ని చూసి చిగురుటాకులు వెక్కిరిస్తాయి. తామూ రాలిపోయే కాలం వస్తుందని తెలుసుకోవు!" అన్నాడు కామయ్య.

మధ్యలో అత్త అవతలికి వెళ్ళి, వడ్డనకు కోడలు వచ్చింది. ఆమె కామయ్యతో, "మా అత్త మహా చెడ్డది. 'నువ్వు మాత్రం అత్తవు కాకపోతావా? అనుభవించక పోతావా' అంటుంది," అన్నది.

"అందరూ పోయేవారే కదా అని చిన్నతనం నుంచీ కట్టెలు సిద్ధం చేసుకుంటామా?" అన్నాడు కామయ్య, సానుభూతిగా.

రంగయ్య వచ్చి, కామయ్య తన భార్యతోనూ, కోడలితోనూ అన్నమాటలు తెలుసుకుని, "నీ కొడుకు లోకజ్ఞుడు, దివాణంలో రాణిస్తాడు," అని రామయ్యకు కబురు చేశాడు.

—ఎస్. అగ్నల్.





# వాక్కు

గంగలూరు అనె గ్రామంలో రంగన్న అనే వాడు ఉండే వాడు. రంగన్నది శాంత స్వభావమూ, వింత మనస్తత్వ మూనూ. అతను మిత భాషి, ఎవరి జోలికీ పోడు. అతన్ని గ్రామవాసులందరూ తెలివి లేని వాడి కిందనే జమకట్టే వారు.

రంగన్న భార్య కమల గడుసు మనిషి. ఆమె నోరు చాలా చెడ్డది. అందరూ ఆమె నోటికి భయపడతారు. ఆమెకు డబ్బు కాపీనం ఎక్కువ. అందుకే ఆమె రంగన్నను గంగలూరు తెచ్చి, అతడి చేత వేరే కాపరం పెట్టించింది; ఇంటికి అవసరం అయిన ఖర్చులు కూడా తగ్గించి, డబ్బు మిగిల్చి, దానితో వడ్డీవ్యాపారం చేసి, వడ్డీ డబ్బుతో బంగారు నగలు చేయించుకొని, తెగ మురిసి పోతూండేది.

రంగన్న తమ్ముడు లింగరాజు కొంత మందితో కలిసి తీర్థయాత్రలకు పోతూ, డబ్బు తన ఇంట్లో ఉంచటం మంచిది కాదని ఆలోచించి, గంగలూరులో ఉన్న తన అన్న ఇంట దాచి, యాత్రలకు బయలుదేరాడు.

కమల తన మరిది దాచిన ధనం లెక్క పెట్టింది. ఆరు వందల రూపాయలు! ఆ సొమ్ము చూడగానే కమలకు ఎక్కడలేని ఆశ పుట్టింది. దాన్ని సొంతం చేసుకోవటం ఎలాగా అని దీర్ఘంగా ఆలోచించి, చివరకు ఆమె ఒక నిర్ణయానికి వచ్చింది.

రంగన్న ఏదో పనిమీద పట్నం పోతున్నాడు. కమల అతనితో ఎంతో మంచిగా, "ఏమండోయ్, నా అయిదు పేటల బంగారు గొలుసూ, కొంత పైకం ఇస్తాను. పట్నంలో నా గొలుసుకు ఆరో పేట వేయించి, జాగ్రత్తగా పట్టుకు రండి," అన్నది.

గుండాల విజయ

రంగన్న నేగతో బాటు డబ్బు సంచీ అందుకుంటూ, అది లింగరాజుదని గుర్తించి, "ఈ డబ్బు మనది కాదు," అని లేని ధైర్యం తెచ్చుకుని, నెమ్మదిగా అన్నాడు.

"మీ తెలివి తేటలు మండిపోనూ! లింగరాజు మనకు పరాయి వాడా? వాడి సొమ్ము మనది కాదా? వాడు నా బిడ్డ వంటి వాడు! వాడి డబ్బు తినే హక్కు నాకున్నది. లేదనగల వాడెవడో ముందుకు వచ్చి, మాట్లాడమను!" అన్నది కమల ధీమాగా.

"నిజమే సుమీ! లింగరాజు మన బిడ్డ వంటి వాడు!" అని రంగన్న నగా, డబ్బూ తీసుకుని పట్నం బయలుదేరాడు.

రంగన్న పట్నం చేరేసరికి సాయంత్రం అయింది. అతను బాగా అలసిపోయి, విశ్రాంతి కోసం దాపులనున్న సత్రవుకు వెళ్ళాడు. అక్కడ లింగరాజు కనిపించే సరికి రంగన్నకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది.

"అటు వైపు వరదలు వచ్చాయి. దారి లేదు. అందుచేత ఇంటి ముఖం పట్టాం. రేపు ఉదయం బయలుదేరి గంగలూరికి వెళ్ళి, నా డబ్బు తీసుకుని, అటు నుంచి ఇంటికి పోతాను," అన్నాడు లింగరాజు తన అన్నతో

"డబ్బు కోసమే అయితే గంగలూరు వెళ్ళక్కర్లేదు. డబ్బు నా దగ్గిరే ఉన్నది. కాని ఆ డబ్బు మీ వదినె తీసుకున్నది.



నువు దానికి కొడుకు వంటి వాడివిట! అందు చేత, తల్లిగా నీ సొమ్ము అనుభ వించే హక్కు దానికి ఉన్నదిట! ఇక ఆ డబ్బు మీద ఆశ వదులుకో!'' అన్నాడు రంగన్న.

ఎంతో కాలం కష్టపడి పోగు చేసి భద్రంగా దాచిన డబ్బు ఇలా పోయిందే అన్న బాధతో లింగరాజు కళ్ళు నీళ్ళ పర్యంతమయాడు.

తమ్ముడి స్థితి చూసి రంగన్నకు జాలి పుట్టు కొచ్చింది. కమల మాట జవ దాటటం ప్రమాదమని అతనికి తెలుసు. కాని ఎలాగైనా తమ్ముడికి డబ్బు పోయిం దన్న బాధ కలగకుండా చూడాలి! ఎలా? ఎలా?

అకస్మాత్తుగా రంగన్నకు మెరుపు లాంటి ఆలోచన వచ్చింది.

''విచారించకు, తమ్ముడూ. నీకు తల్లి వంటి వదినె నీ డబ్బు తిన్నది గాని పై వాళ్ళేమీ పట్టుకు పోలేదు గద? ఆమె కొడుకుగా ఈ నగ తీసుకునే హక్కు నీకూ ఉన్నది! అందుచేత నువు ఈ నగ తీసుకో!'' అంటూ ఆ నగ తమ్ముడికి ఇచ్చి, రంగన్న మర్నాడే గంగలూరికి తిరిగి వచ్చాడు.

రంగన్న చేసిన ఘనకార్యం విని, ''రెండువేల రూపాయల నగ పోయింది రోయ్! ఈ దద్దమ్మ తెలివి తేటలు మండి పోనూ!'' అని కమల శాపనార్థాలు పెట్టింది.

కమల అలా ఎందుకు గోల పెడు తున్నదో అర్థం కాక, తాను చేసిన తప్పే మిటో తెలియక, రంగన్న వెర్రి మొహం వేసుకు చూశాడు.

మరి కొంచెం సేపటికి లింగరాజు వచ్చి, ఏమీ అనకుండా కమల నగ కమలకు ఇచ్చినప్పుడు, ఆమెకు ప్రాణం లేచి వచ్చింది.

లింగరాజు దాయమని యిచ్చిన తన డబ్బు సంచీ తాను తీసుకుని, అన్నకూ, వదినెకూ వెళ్ళి వస్తానని చెప్పి, తన గ్రామం చేరాడు.



# తెలివైన పనివాడు

గోపయ్య అనేవాడు శరభయ్య దుకాణంలో కొత్తగా పనికి కుదిరాడు. వాడు చెప్పిన పనులన్నీ తెలివిగానూ, చురుకుగానూ చేస్తూపోతున్నాడు. ఒకనాడు ఉదయం శరభయ్య దుకాణానికి వచ్చి, చొక్కా విప్పి వంకీకి తగిలించుతూండగా జేబులో నుంచి కొన్ని నాణాలు కిందపడ్డాయి. గోపయ్య చప్పున వాటిని ఏరి, శరభయ్యకు ఇచ్చాడు.

ఆ రాత్రి శరభయ్య భోజనం చేసి, చెయ్యి కడుక్కుని, తన గదిలోకి వెళ్ళాడు. శరభయ్య భార్య కంచం ఎత్తడానికి పోతూండగా, గోపయ్య చప్పున కంచంలో చెయ్యిపెట్టి, ఉంగరం తీసి శరభయ్యకు ఇయ్యడానికి గదిలోకి వెళ్ళాడు.

శరభయ్య గోపయ్యను పనిలో నుంచి తీసేశాడు. ఆతని భార్య కారణం అడిగింది.

"ఉదయం నా జేబులో నుంచి డబ్బులు పడిపోతే, నాకు లెక్క తెలియదనుకుని ఒక రూపాయినాణెం మూలకునెట్టి, మిగిలినవి నాకు ఏరి ఇచ్చాడు. ఈ పూట అన్నం తినేటప్పుడు నా వేలి ఉంగరం కంచంలో పడిపోతే, నా వేలికి ఉంగరం లేదన్న సంగతి కనిపెట్టాడు. నా మీద అంతగా నిఘా ఉంచినవాడు నాకు పనికిరాడు," అన్నాడు శరభయ్య.

—ఎమ్. వి. వి. సత్యనారాయణ.






# నిజమైన భోక్తలు

విద్యాపురం గ్రామాధికారి విరూపాక్షయ్య మంచి స్థితిపరుడు. ఆయన నిత్యమూ పేదసాదలకు దానధర్మాలు చేసేవాడు అకలితో వచ్చిన వారికి లేదనకుండా అన్నం పెట్టించే వాడు. ఆయన ప్రతి ఏడూ వైశాఖమాసం పొడుగునా నిరతాన్న దానం చేసేవాడు. అందు చేత, వైశాఖ మాసం రాగానే, చుట్టుపట్ల ఊళ్ళనుంచే గాక, దూరప్రాంతాల నుంచి కూడా సాధు సన్యాసులు విద్యాపురం చేరి, విరూపాక్షయ్య షడ్రసోపేతంగా పెట్టే భోజనం ఆశగా తినేవాళ్ళు.

ఒక ఏడు విరూపాక్షయ్య వైశాఖ మాసపు అన్నదానం ఏర్పాట్లు చేస్తూండగా, అతని భార్య విమలాక్షి. ''ఏమండీ, ఈ ఏడన్నా భోక్తలు అందరూ సాధుసన్యాసులుగా వుండేటట్టు చూడండి. దైవ స్వరూపులయిన సాధుసన్యాసులకు ఏమైనా ఇస్తే పుణ్యమూ పురుషార్థమూనూ! సగానికి పైగా ఉండే బీదాబిక్కి అలగా జనాన్ని మేపితే ఏంవస్తుంది?'' అన్నది.

'' విమలాక్షి, కాషాయ వస్త్రాలు ధరించిన మాత్రాన అందరూ దైవ స్వరూపులవుతారా? అవి లేని వాళ్ళు మనం పెట్టే తిండికి అనర్హులా? రేపు మనం అన్నదాన కార్యక్రమం ప్రారంభించగానే, నేను చెప్పినట్టు చెయ్యి; నా మాటల్లో వున్న నిజం నీకే తెలుస్తుంది,'' అంటూ విరూపాక్షయ్య తన భార్యకు ఒక పథకం చెప్పాడు.

విమలాక్షి ఆ పథకం ప్రకారం చెయ్యటానికి నిర్ణయించుకున్నది.

మొదటి రోజు అన్నదాన కార్యక్రమం ఆరంభం అవుతుండగానే, పది మంది సాధువులు తమకేదో ప్రత్యేకత ఉన్నట్టు

ఎమ్. డి. సౌజన్య

లోపలికి వచ్చి, ''ముందు మా బృందానికి వడ్డించండి!'' అని, పంచభక్ష్య పరమాన్నాల కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు.

ఇంతలో, విరూపాక్షయ్య సహాయంతో విమలాక్ష పది మూకుళ్ళలో గంజి పోసి తెచ్చి, పదిమంది సాధువుల ముందూ పెట్టి, ''స్వాములూ, ఈ ఏడు పంటలు పండక ప్రతి ఏడూ లాగ పంచభక్ష్యాలతో అన్నదానం చేయలేక పోయాం! ఈ గంజే పంచభక్ష్యాలుగా స్వీకరించండి!'' అన్నది.

అంతే! సాధువులంతా ఉగ్రనరసింహ మూర్తుల్లా లేచి, మండి పడుతూ, ''మూడు ఆమడల దూరం నుంచి నడిచి వచ్చింది ఈ పాటి గంజి దొరకకనా? ఛేతగాకపోతే ఇలాటి అన్నదానం చెయ్యక పోతేనేం?'' అంటూ గంజి మూకుళ్ళను చిందర వందరగా కాళ్ళతో తన్ని వెళ్ళి పోయారు.

ఎంతో సాధువులూ, సౌమ్యులుగా ఉండే వాళ్ళకు, పంచభక్ష్యాలు లభించకపోయే సరికి అంత ఆగ్రహం కలుగుతుందని ఊహించని విమలాక్ష నోట మాట లేక, నిలబడి పోయింది.

త్వరలోనే మరో సన్యాసుల బృందం వచ్చింది. గడ్డాలు సవరించు కుంటూ, ఆరగించబోయే విందును గురించి ఊహించుకుంటూ, కూర్చుని వున్న ఆ సన్యాసుల ముందు విమలాక్ష మళ్ళీ



మూకుళ్ళతో గంజి తెచ్చిపెట్టి, ఎంతో మర్యాదగా ముందు సాధువులకు చెప్పి నట్టే చెప్పింది.

విషయం అర్థం కాగానే వీళ్ళు కూడా సమ్మె చేస్తున్నట్టుగా లేచి, ''ముష్టివెధవ లకు పోసే ఈ గంజి నీళ్ళు సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులకు పొయ్యటానికి చేతులెలా వచ్చాయి? మా ఖర్మగాలి సన్యాసులమయాము గాని, మేమూ ఒకప్పుడు మీకన్నా బాగా బతికిన వాళ్ళమే!'' అని అరుస్తూ, మూకుళ్ళను కాళ్ళతో తన్ని వెళ్ళిపోయారు.

ఈ యేడు వైశాఖ మాసపు అన్న దానంలో గంజి నీళ్ళు మాత్రమే లభిస్తా యని, నెలరోజుల పాటు సుష్టుగా తిందా మని వచ్చిన సాధువులకూ, సన్యాసులకూ బ్రాహ్మణులకూ తెలిసిపోయింది. వాళ్ళు విరూపాక్షయ్యనూ, విమలాక్షినీ తిట్టు కుంటూ వెళ్ళిపోయారు. ఇక మిగిలినది కుంటీ, గుడ్డీ, పేద వాళ్ళూ, తిండికి ముఖం వాచిన వాళ్ళూనూ

విమలాక్షి వాళ్ళను ఇంట్లోకైనా ఆహ్వా నించకుండా, ''ఈ ఏడు మా ఇంట్లో పంచభక్ష్యాల భోజనం లేదు, కేవలమూ గంజి మాత్రమే ఉన్నది! అదైనా మని షికి ఒక మూకుడు మాత్రమే!'' అని చెప్పింది.

ఆ మాటలు విని, సంతోషంతో విప్పా రిన ముఖాలతో వాళ్ళు, ''అదే పెట్టు, తల్లీ! మేం రోజూ పంచభక్ష్యాలు తింటు న్నాం గనకనా? ఆ గంజి అయినా తాగి ఎన్నాళ్ళయిందో!'' అంటూ వీధిలోనే బారులు తీరి కూర్చుని, గంజి తృప్తిగా తాగి, విమలాక్షిని, ''అన్నపూర్ణమ్మ తల్లి పది కాలాల పాటు చల్లగా ఉండాలి,'' అని దీవించి సంతోషంగా, అక్కడినుంచి వెళ్ళారు.

ఆకలితో ఉన్న వాడే నిజమైన భోక్త అని విమలాక్షి అర్థం చేసుకున్నది. అలాటి వాళ్ళకు తిండి పెట్టటమే పుణ్యమూ, పురుషార్థమూ అని ఆమెకు తెలిసింది.





# లంచగొండి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్త్వుడు ఆయన వద్ద క్రయాధికారిగా వుండేవాడు.

క్రయాధికారి అంటే రాజ్యానికి అవసరం అయిన వస్తు, వాహనాల్లాంటివి నాణ్యం చేయటంలోనూ, వాటి విలువ కట్టటంలోనూ నేర్పుగల వాడన్నమాట.

బోధిసత్త్వుడు, కాశీరాజ్యానికి కావలసిన ఏనుగులనూ, గుర్రాలనూ, వెండి బంగారాలనూ పరీక్ష చేసి, విలువకట్టి, తన అంచనా ప్రకారం,ఆ జంతువులనూ, వస్తువులనూ తెచ్చిన యజమానులకు డబ్బు చెల్లించుతూండే వాడు.

రాజు బ్రహ్మదత్తుడు పరమ లోభి కావటం చేత, తన క్రయాధికారి అయిన బోధిసత్త్వుణ్ణి గురించి, ఆయనకు ఒక అపోహ కలిగింది. ఈ క్రయాధికారి కొనే ప్రతి వస్తువుకూ ఎక్కువ ధర చెల్లిస్తున్నాడని కొందరంటున్నారు. ఇది నిజమే అయుండాలి. ఇలా అయితే, త్వరలోనే నా రాజ్యం దివాలా ఎత్తుతుంది!

రాజు ఒకనాడు యిలా ఆలోచిస్తూ, ఉద్యానం వైపు కిటికీరెక్కలు తెరిచాడు. అక్కడ ఎండలో ఎంతో శ్రమిస్తూ చెట్లకు నీళ్ళు పోస్తున్నవాడొకడు ఆయన కంటబడ్డాడు. వెంటనే ఆయనకు, "ఆహఁ, వీడెంత నమ్మకస్థుడు కాకపోతే, యిలా ఎండలో శ్రమపడతాడు!" అన్న ఆలోచన వచ్చింది.

ఆ మర్నాడే రాజు తోటపని చేసేవాణ్ణి, బోధిసత్త్వుడి స్థానంలో క్రయాధికారిగా నియమించాడు. ఈ కొత్తవాడు తన బుద్ధి కుశలత వల్ల వస్తువులు క్రయం చేయటంలో యుక్తి చేసి, తనకు లాభసాటిగా వ్యవహరిస్తాడని రాజు ఆశ. కాని యీ కొత్త క్రయాధికారి దురాశాపరుడే తప్ప,



వివేకం గలవాడు కాదు. అతడికి వస్తు తత్వం గాని, నాణ్యం గాని, దాని విలువ గాని ఏ మాత్రమూ తెలియదు. అందు చేత ఏనుగులూ, గుర్రాలూ, వస్తుసామగ్రీ బేరం చేయవలసి వస్తే, తన బుద్ధికి ఏమి తోస్తే అది అడగటమే తప్ప, ఒక సరి అయిన పద్ధతీ, అంచనా వుండేది కాదు. ఆ కారణంగా వస్తువులు అమ్మకానికి తెచ్చే వర్తకులకు తరచు నష్టం కలుగుతూండేది.

తమ వస్తువులు కొనేది రాజుగారి క్రయాధికారి గనక, నష్టం కలిగినా మారు మాట్లాడలేక వర్తకులు, యిచ్చిందేదో పుచ్చుకుని ఇళ్ళకు పోయేవాళ్ళు. వర్తకులు తమకు బేరంలో అన్యాయం జరిగిందని కాని, బాగా నష్టపడ్డామని కాని పైకి చెప్పటానికి భయపడేవాళ్ళు.

ఒక రోజున ఉత్తర దేశం నుంచి, ఒక అశ్వవర్తకుడు, ఐదువందల మేలు జాతి గుర్రాలను తీసుకుని కాశీరాజు వద్దకు వచ్చాడు. వెంటనే రాజు తన ఆస్థాన క్రయాధికారి వద్దకు కబురు పంపి, ఆ గుర్రాలను నాణ్యం చేసి, విలువ కట్టమన్నాడు.

క్రయాధికారి వచ్చి ఐదువందల గుర్రాలనూ పరీక్షించి, "ఎంత ఆలోచించినా వీటి విలువ ఒక కుంచెడు బియ్యం కన్న ఎక్కువ కాదనిపిస్తున్నది. వీటి యజమానికి కుంచెడు బియ్యం యిచ్చి, గుర్రాలను శాలలో కట్టి వెయ్యండి," అని ఉత్తరువులు జారీ చేశాడు.

అశ్వవర్తకుడు దిగాలు పడిపోయి, ఇతర వర్తకుల్లాగా తన దారిన తాను వెళ్ళక, సరాసరి రాజుగారి పూర్వపు క్రయాధికారి అయిన బోధిసత్వుడి దగ్గిరకు పోయి, తనకు జరిగిన అన్యాయం గురించి చెప్పుకున్నాడు.

బోధిసత్వుడు అంతా విని, "అయ్యా, ఒక పని చెయ్యి. ఈ కొత్త క్రయాధికారిని తృప్తిపరిచేందుకు, ముందుగా అతడికి లంచం డబ్బులు యిచ్చి, తరవాత

యిలా అడుగు: 'నా గుర్రాలకు తమరు కట్టిన కుంచెడు బియ్యం విలువ న్యాయం గానే వున్నది. ఐతే, యీ కుంచెడు బియ్యానికి విలువ ఎంతో తమరు సభలో రాజుగారి ఎదట చెప్పగలరా?' ఇందుకు క్రయాధికారి అంగీకరిస్తే, అతణ్ణి రేపు రాజుగారి దగ్గిరకు తీసుకుపో. ఆ సమయంలో నేను అక్కడ వుండి, నీకు న్యాయం జరిగేలా చూస్తాను," అన్నాడు.

బోధిసత్వుడు చెప్పినట్టుగా ఆ అశ్వవర్తకుడు వెంటనే క్రయాధికారి దగ్గరకు పోయి, అతడికి లంచంగా కొంత డబ్బిచ్చి, బోధిసత్వుడు అడగమన్న విధంగా అడిగాడు.

క్రయాధికారి పరమానంద పడిపోతూ, "దానిదేముంది! ఈ కుంచెడు బియ్యం విలువ చెప్పటం ఏమంత కష్టం కాదు. రేపు సభలో రాజుగారికి ఆ సంగతి చెప్పి, ఆయనచేత సరే అనిపిస్తాను," అన్నాడు.

మర్నాడు రాజసభ కిటకిటలాడుతున్నది. మంత్రులూ, ముఖ్యోద్యోగులూ వచ్చారు. రాజుగారి అనుమతి పొంది బోధిసత్వుడు కూడా వచ్చాడు.

నష్టపోయిన అశ్వవర్తకుడు రాజుతో, "ప్రభూ, తమ కొత్త క్రయాధికారి, నా ఐదువందల గుర్రాలకూ కుంచెడు బియ్యం విలువ కట్టటం బాగానే వున్నది.



ఇందులో నా కొక చిన్న సందేహం కలుగుతున్నది. ఆ కుంచెడు బియ్యానికీ విలువ ఎంత?" అన్నాడు.

ఆ క్షణంవరకూ రాజుకు జరిగినదేమిటో తెలియదు. ఆ కారణంగా ఆయన ఆశ్చర్యపోతూ, కొత్త క్రయాధికారిని, "ఐదువందల గుర్రాల విలువ ఎంత కట్టావు?" అని అడిగాడు.

"కుంచెడు బియ్యం, ప్రభూ!" అన్నాడు విక్రయాధికారి తొణకకుండా.

"అలాగా! బాగానే వుంది. ఐదువందల గుర్రాల విలువ కుంచెడు బియ్యం అయితే, ఆ కుంచెడు బియ్యం విలువ ఎంత?" అన్నాడు రాజు.

అస్థాన క్రయాధికారి తడుపుకోకుండా, "కుంచెడు బియ్యం విలువ మరెంతో కాదు, ప్రభూ! కాశీరాజ్యమూ, ఇరుగు పొరుగు సామంత రాజ్యాలూ కలిపితే, ఎంత విలువ వుంటుందో, అంత!" అన్నాడు.

ఎంతో విడ్డూరమైన యీ జవాబు విని, మంత్రులూ, సభలోని రాజోద్యోగులూ, పురప్రముఖులూ అవహేళన చేస్తూ చప్పట్లు కొట్టారు. కొందరు రాజు సభలో వున్న సంగతే మరిచి, పొట్టలు చెక్కలయ్యేలా నవ్వటం ప్రారంభించారు.

వాళ్ళల్లో ఒక ప్రముఖుడు లేచి, కొత్త క్రయాధికారితో, "ఇంత కాలంగా రాజ్యాలకు విలువ కట్టటం అసాధ్యం అనుకుంటూ వచ్చాం. కాని, కాశీరాజ్యమంతా కలిసి కుంచెడు బియ్యం విలువ చేస్తుందని, నీ వల్ల యిప్పుడే తెలుసుకున్నాం. ఆహాఁ, నీ తెలివి తేటలు అద్భుతం. ఎంత గొప్ప వివేకివి,!" అంటూ గేలి చేశాడు.

అప్పుడు బోధిసత్త్వుడు సభ ముందుకు వచ్చి, "ఈ క్రయాధికారి చెప్పినది పరమసత్యం, అందులో విడ్డూరం ఏమీ లేదు. అతణ్ణి చూసి నవ్వకండి. ఐదు వందల గుర్రాలూ, ఒక కుంచెడు బియ్యం విలువ అన్నాడు. ఒక కుంచెడు బియ్యం విలువ కాశీరాజ్యమూ, సామంత రాజ్యాలూ కలిపినంత అని చెప్పాడు. దీన్నిబట్టి, ఆ ఐదువందల గుర్రాల విలువ, కాశీరాజ్యమూ, సామంత రాజ్యాలూ కలిపినంత అని అర్థమవుతున్నది. ఇందువల్ల క్రయాధికారి గుర్రాలకు కట్టిన విలువ చాలా న్యాయంగా కనబడుతున్నది," అన్నాడు.

బోధిసత్త్వుడి మాటలకు అందరూ ఆశ్చర్యపోయారు. విచారించగా జరిగినదంతా తెలియవచ్చింది. అప్పుడు కాశీరాజు తన పొరబాటు గ్రహించి, లంచగొండి క్రయాధికారిని పదవి నుంచి తొలగించి, తిరిగి బోధిసత్త్వుణ్ణి ఆ పదవిలో నియమించాడు.





# బుద్ధుడి నిర్వాణం

బుద్ధుడికి సారిపుత్ర, మౌద్గల్యాయనులనే యోగ్యులూ, సమర్థులూ అయిన యిద్దరు శిష్యులున్నారు. ఆయన వారిద్దరినీ బౌద్ధధర్మ ప్రచారానికి నియోగించాడు. శిష్యులిద్దరూ వేరువేరు ప్రాంతాల నివాసం ఏర్పరచుకున్నారు.

కొన్ని సంవత్సరాల తర్వాత సారిపుత్ర, తాను నిర్వాణం చెందవలసిన సమయం సమీపించిందని గ్రహించి, బుద్ధుడి దర్శనం చేసుకున్నాడు. బుద్ధుడి ఆశీర్వాదం పొంది, అతడు తన తల్లిదగ్గిరకు పోయి, ఆమెచేత బౌద్ధమతం స్వీకరింపజేసి, ఒకనాటి సూర్యోదయం వేళ నిర్వాణం చెందాడు.





మౌద్గల్యాయనుడి బౌద్ధధర్మ బోధలు, మత దురహంకారులైన కొందరికి కోపం తెప్పించాయి. వాళ్ళు, అతణ్ణి చంపేందుకు ఒక దుష్టుణ్ణి పంపారు. కాని, వాడు తన కుటీరంలో ప్రవేశిస్తూండగా మౌద్గల్యాయనుడు అద్భుతంగా గాలిలో తేలుతూ, వాడికి అందకుండా పోయాడు.



ఈ విధంగా మౌద్గల్యాయనుడు, అనేక
సార్లు తనను హత్యచేయవచ్చిన వారి
నుంచి తనను తాను కాపాడుకున్నాడు.
కాని, ఒకసారి హంతకుడు దుడ్డుకర్ర
ఎత్తి పట్టుకుని తన కుటీరాన్ని ప్రవే
శిస్తూండగా, ఆయనకు హఠాత్తుగా తన
పూర్వజన్మకు సంబంధించిన ఒక
సంఘటన గుర్తుకు వచ్చింది.

పూర్వజన్మలో అతడు, తన వృద్ధమాతా
పితలను వదిలించుకోదలిచి, వాళ్ళను
అరణ్యానికి తీసుకుపోయాడు. అక్కడ
వాళ్ళు, ఒక చెట్టు నీడన కూర్చుని
వుండగా, తాను పెద్దగడ్డం తగిలించు
కుని, వాళ్ళను చంపబోయాడు. వాళ్ళు
పెద్దగా, "ఒరే నాయనా, మమ్మల్ని
ఎవడో చంపబోతున్నాడు, నీవు పారి
పోయి ప్రాణాలు దక్కించుకో,"
అంటూ అరిచారు. తలిదండ్రుల
హెచ్చరిక, అతడిలో హృదయపరివర్తన
కలిగించింది.





అతడు వెంటనే దూరంగాపోయి,
తగిలించుకున్న గడ్డం తీసి
వేసి, తలిదండ్రులను ఇంటికి తీసుకు
పోయాడు. ఈ పూర్వజన్మ పాపకార్యం
గుర్తుకు రాగానే, మౌద్గల్యుడికి గల
అద్భుతశక్తి నశించింది. హంతకుడు
ఆయనను కర్రతో బాది, చచ్చాడను
కుని వెళ్లిపోయాడు. కాని, మౌద్గల్యుడు
కొన ప్రాణంతో బుద్ధుణ్ణిచేరి, ఆయన
పాదాల ముందు ప్రాణంవిడిచాడు.

ఇప్పుడు బుద్ధుడి వయను ఎనభైఏళ్ళు. ఒకనాడాయన వైశాలీనగరం వెళ్ళాడు. అత్యంత సౌందర్యవతి అయిన రాజనర్తకి అంబాపాలి ఆయన్ను చూడ వచ్చింది. ఆమె బుద్ధుడికీ, ఆయన శిష్యులకూ తన ఉద్యానవనంలో విడిది ఏర్పాటు చేసి, భోజనానికి తన ఇంటికి రావలసిందిగా ఆహ్వానించింది. బుద్ధుడు అంగీకరించాడు.





ఇది జరిగిన మరుక్షణాన కొందరు కులీనులు, ఆయన్ను చూడవచ్చి, తమతో కలిసి భుజించవలసిందిగా కోరారు. అంతేకాక, రాజనర్తకి యింట భోజనం చేయటానికి అంగీకరించినందుకు తప్పుపట్టారు. ఆయన వాళ్లతో, "గంగా, కృష్ణానదులు వేరైనా, అవి సముద్రంలో కలిశాక. తమ భిన్నత్వాన్ని కోల్పోతాయి. నా బోధలు అందీకరించిన నటనాంగనలూ, కులీనులూ కూడా అంతే," అన్నాడు.

ఆ తరవాత బుద్ధుడు ఒకనాడు తన శిష్యులను పిలిచి, తాను మరి మూడు నెలలకు నిర్వాణం చెందబోతున్నట్టు చెప్పాడు. శిష్యులు దుఃఖించసాగారు. బుద్ధుడు వారికి ధైర్యంచెప్పి, "ఎంతటి వారికీ మరణం తప్పదు. ఇక ముందు నా బోధలే మీకు మార్గదర్శకాలు," అన్నాడు.





బుద్ధుడు వైశాలి నుంచి బయలుదేరి పావానగరం చేరాడు. అక్కడ ఆయన శిష్యుడైన చుందుడు అనే కమ్మరి ఆతిథ్యం యిచ్చాడు. అతను ఎంతో భక్తితో బుద్ధుడికి మాంసాహారంతో భోజనం పెట్టాడు. ఈ మాంసభోజనం తనకు హానిచేస్తుందని తెలిసీ, బుద్ధుడు తన శిష్యుడిపైగల ప్రేమకొద్దీ వద్దన లేకపోయాడు.

భోజనానంతరం బుదుడికి జబ్బు చేసింది. తన నిర్వాణం సమీపించిందని ఆయన శిష్యులకు చెప్పాడు. ఆయన తుదిదర్శనం కోసం జనం గుంపులుగా కూడారు. అంత జబ్బుస్థితిలోనూ బుద్ధుడు, తనను ప్రశ్నించినవారి ధర్మ సందేహాలకు జవాబులిచ్చాడు. తరవాత ప్రశాంతంగా కన్నుమూశాడు.





బుద్ధుడి ధర్మబోధలు దశదిశలా వ్యాపించాయి. ఆయన పేర స్థూపాలూ, భిక్షువులకు విహారాలూ ఒక్క భారతదేశంలోనేకాక, ఇతరదేశాల్లో కూడా నెలకొల్పబడ్డాయి. ఆయన ధర్మబోధలపై అసంఖ్యాకమైన కావ్యాలూ, నాటకాలూ, సమీక్షాగ్రంథాలూ వెలువడినై. బౌద్ధమతం ప్రపంచంలోని అతిముఖ్యమైన మతాల్లో ఒకటిగా స్థిరపడిపోయింది.



# ఉగ్రసేనుడి కోపం

ఉగ్రసేన మహారాజుకు కోపం చాలా ఎక్కువ. అతను యువరాజుగా ఉన్నంత కాలమూ ఇబ్బంది లేకపోయింది. కానీ రాజయిన క్షణం నుంచీ అది చాలా అనర్థాలకు దారితీయ సాగింది.

తన కోపాన్ని అదుపులో ఉంచుకోవటానికి ఉగ్రసేనుడు శతవిధాల ప్రయత్నించాడు. అయినా కోపం వచ్చే సరికి అతనికి ఒళ్ళు తెలియక చాలా కౄరంగా ప్రవర్తించే వాడు. అయితే కోపం తగ్గాక అతనంత మంచివాడు లేడు!

ఒక పర్యాయం అతను ఒక భటుడి మీద కోపం వచ్చి, అప్పటికప్పుడు పాతిక కొరడా దెబ్బలు శిక్ష విధించి, అమలు జరిపించాడు. వాడు దెబ్బలుతిని సొమ్మసిల్లి పడిపోయాక, రాజుకు కోపం తగ్గి, భటుడికి వైద్యం చేయించి, రాణి వద్దకు పోయి, పశ్చాత్తాపం ప్రకటించాడు.

"మీకు ఇంత కోపం ఉండడం దేశానికి ప్రమాదం," అన్నది రాణి.

"నేనేం చెయ్యను? కోపాన్ని అణచుకోవాలనే ప్రయత్నిస్తున్నాను," అన్నాడు ఉగ్రసేనుడు.

"నే నొక ఉపాయం చెబుతాను. ఈసారి నుంచీ, కోపం వచ్చినప్పుడు మరొకరికి మీరు ఏ శిక్ష విధిస్తారో, అదే శిక్ష మీరూ అనుభవించండి," అన్నది రాణి.

వారం రోజులైనా తిరగక ముందే ఉగ్రసేనుడు కోపావేశంలో మరొక భటుడికి పాతిక కొరడా దెబ్బల శిక్ష విధించాడు. శిక్ష అమలు జరిగాక అతని కోపం తగ్గిపోయింది. అప్పుడు రాణీ మాటలు గుర్తురాగా, "చిన్న తప్పుకు పాతిక కొరడా దెబ్బల శిక్ష విధించడం నేరం! ఈ తప్పు చేసినందుకు నేనూ ఇదే శిక్ష అనుభవిస్తాను," అన్నాడు.

"వసుంధర"



ఈ మాటకు ఉగ్రసేనుడి అహంకారం దెబ్బతిన్నది

"నన్ను కొట్టలేదన్న నేరానికి నా భటులను నేను ఎలా శిక్షించగలను? చేతనైతే ఈ శిక్షను నువ్వే అమలు జరుపు," అన్నాడు అతను.

రాణి వెంటనే ఒక భటుణ్ణి పిలిపించి, "నేను చెప్పినది చేస్తావా, లేక తక్షణం చస్తావా?" అని అడిగింది.

భటుడు వణికిపోతూ, రాణి చెప్పిన పని చేస్తానన్నాడు. రాణి వాడి చేతికి కొరడా ఇచ్చి, రాజును కొట్టమన్నది. వాడు అందుకు సిద్ధపడ్డాడు.

మొదటి కొరడా దెబ్బ తినగానే రాజుకు చుర్రుమన్నది. రెండో దెబ్బ పడే లోగా అతను తిరగబడి, భటుడి చేతి నుంచి కొరడా లాగేసుకుని, వాణ్ణి పది దెబ్బలు కొట్టాడు. రాణి ఏదో అనబోతే, అతను వినిపించుకోకుండా, అక్కడి నుంచి చరచరా మంత్రి వద్దకు వెళ్ళి, "మంత్రీ, రాణి రాజద్రోహం తలపెట్టింది. ఆమెకు దేశబహిష్కరణ శిక్ష విధించాను. దాన్ని వెంటనే అమలు జరపక పోతే మీరు కూడా రాజద్రోహిగా పరిగణించ బడతారు!" అన్నాడు.

గత్యంతరం లేక మంత్రి రాణిని సమీపారణ్యంలో విగవిడిచాడు.

అయితే అక్కడ ఉన్న భటులలో ఎవడూ రాజును కొరడాతో కొట్టడానికి ముందుకు రాలేదు. రాజు శాసించి కూడా లాభం లేకపోయింది.

ఉగ్రసేనుడు రాణి వద్దకు వెళ్ళి జరిగినది చెప్పాడు.

రాణి నవ్వి, "భటుడు చిన్నతప్పు చేసినందుకే పాతిక కొరడా దెబ్బలు కొట్టించారు. రాజుగారి శాసనాన్ని పాలించక పోవడం పెద్ద నేరం గదా! అయినా అంత నేరం చేసినా భటుల మీద మీకు కోపం లేదు. అంటే శిక్ష అనుభవించాలన్న కోరిక మీకు లేనే లేదన్న మాట!" అన్నది.

తరవాత రాజు కోపం తగ్గి, పశ్చాత్తాపం కలిగి, రాణిని తిరిగి అంతఃపురానికి తెప్పించుకున్నాడు. దానితోబాటు రాణికి ఎంతగానో క్షమాపణ చెప్పుకున్నాడు.

"ప్రభువులు మన్నిస్తే, ఇంకో ఉపాయం చెబుతాను; మీరు కోపోద్రేకంలో వేసే శిక్ష వెంటనే అమలు పరచకుండా శాసించండి. ఈ లోపల మీ కోపం తగ్గుతుంది. కోపం తగ్గినాక మీ అంత మంచివారు ఉండరుగదా!" అన్నది రాణి.

రాజు తన కింది ఉద్యోగులకు అలాగే చెప్పాడు.

అయితే ఈ ఉపాయం కూడా ఫలించలేదు. తాను వేసిన శిక్ష వెంటనే అమలు జరపనందుకు రాజుకు ఆ వ్యక్తుల మీద కూడా కోపం వచ్చేది. అంతే కాదు, శిక్ష అమలు జరిపే దాకా అతని కోపం అలా, అలా పెరిగిపోయేది!

తన కోపం గురించి ప్రజలేమనుకుంటు న్నారోతెలుసుకోవాలనిపించి, ఉగ్రసేనుడు మారువేషంలో దేశమంతా తిరిగాడు.

ఒకచోట అతనికి తనకన్న కూడా కోపిష్టి వాడు తగిలాడు. వాడు పనిపెట్టుకుని ఉగ్రసేనుడితో గిల్లికజ్జా పెట్టుకుని, పెద్ద గొడవ చేశాడు.

చుట్టుపక్కల వాళ్ళు ఉగ్రసేనుణ్ణి శాంతపరచడానికి ప్రయత్నిస్తూ, "ఊరుకోండి, బాబూ! వాడు అసలే కోపిష్టి వెధవ! కోపం వస్తే మహారాజును కూడా లెక్క చెయ్యడు," అన్నారు.



''ఎందుకు లెక్కచెయ్యడూ? నేనే మహారాజును! వీడు ఇప్పుడు నా కాళ్ళు పట్టుకోకపోతే, యాభై కొరడా దెబ్బలు కొట్టిస్తాను!'' అన్నాడు ఉగ్రసేనుడు తన మారువేషం తొలగిస్తూ.

అతను మహారాజు అని తెలిసికూడా ఆ ముక్కోపి తన ధోరణి మానక, ''రాజైతే నాకు లెక్కేమిటి? తప్పంతా ఆయనదే! ఆయనే నా కాళ్ళు పట్టుకోవాలి!'' అన్నాడు.

ఉగ్రసేనుడికి కోపం రెచ్చిపోయింది. అందుచేత త్వరలోనే ముక్కోపి వాడు కొరడా దెబ్బల శిక్ష అనుభవించడం జరిగింది. వాడు దెబ్బలు తింటూ కూడా రాజును తిట్టుతూనే ఉన్నాడు. అలాంటి మూర్ఖుడికి అంత కఠినశిక్ష విధించి నందుకు రాజును చాలామంది మనసులో తిట్టుకున్నారు.

కోపం తగ్గిన తరవాత రాజు ఈ విషయాన్ని రాణికి చెబుతూ, ''నా ప్రజల్లో నన్ను మించిన కోపిష్టి వాళ్ళు ఉన్నారు. చావుదెబ్బలు తింటూ కూడా కోపాన్ని విడిచి పెట్టలేని వాళ్ళు ఉన్నప్పుడు, నా కోపం గురించి నేను బాధపడనక్కర లేదు!'' అన్నాడు.

రాణి ఒప్పుకోలేదు.

''సామాన్యుడి కోపం వాడికే కష్టం కలిగిస్తుంది. రాజు కోపం రాజుకన్నా ప్రజలకే ఎక్కువ నష్టాన్ని కలిగిస్తుంది. ఇంత కోపం ఉన్న మీకు రాజ్యార్హత లేదు. మీరు రాజ్యక్షేమాన్ని, ప్రజాక్షేమాన్ని కోరే వారైతే రాజ్యపాలన నాకు అప్పగించి, మీరు సామాన్యుడిగా ఉండి పొండి!'' అన్నది.

ఏకళన ఉన్నాడో రాజు దీనికి ఒప్పుకున్నాడు. అధికారం రాణి చేతికి ఇచ్చిన కొంతకాలానికి రాజు కోపం చాలావరకు తగ్గిపోయింది. అధికారం లేకపోతే తన కోపం అదుపులో ఉంటుందని రాజుకు త్వరలోనే అర్థమయింది. ఎందుకంటె అదివరకు అతని కోపానికి దోహదం చేసినది అతనికిగల దండించే హక్కు.



# మంచికి మంచి

రంగమ్మకు నలుగురు కొడుకులు. తన చెల్లెలు చనిపోతే ఆమె కొడుకును రామును అయిదో కొడుకుగా పెంచింది. అందరూ యుక్త వయస్కులయారు. రాము తన స్వగ్రామానికి తిరిగి పోయి, తనకున్న కొద్ది భూములు వ్యవసాయం చేసుకుంటూ జీవించసాగాడు.

రంగమ్మ కొడుకులు నలుగురూ పెళ్ళిళ్ళు చేసుకున్నారు. ఏ కోడలూ రంగమ్మను తన ఇంట ఉండనియ్య లేదు. కొంతకాలం పాటు ఆమె వేరుగా ఉండి, నలుగురూ చేసే ధన సహాయంతో జీవించింది. కొంత కాలానికి ఆ సహాయం కూడా పోయింది. అప్పుడు రంగమ్మ ఒక ధనికుడి ఇంట చాకిరీ చేస్తూ, అక్కడే ఉండసాగింది.

కొంత కాలానికి రాము తన పెత్తల్లిని చూడవచ్చి, ఆమె ఏ కొడుకు వద్దా లేదనీ, ఎవరి పంచనో చేరి, ముసలితనంలో రెక్కల కష్టం మీద బతుకుతున్నదనీ విని చాలా బాధపడ్డాడు. అతను ధనికుడి ఇంటికి వెళ్ళి, రంగమ్మ చాకిరీ చేసుకుని బతకటం తాను సహించలేననీ, ఆమెను తన వెంట తీసుకుపోయి పోషిస్తాననీ అన్నాడు.

రాము బుద్ధిని మెచ్చుకుని ధనికుడు, "పెంచిన తల్లిని నీలాగా చూసుకునేవారు అరుదు, బాబూ. నాకు చాలా సంతోషమయింది. నా కూతురినిచ్చి పెళ్ళిచేస్తాను, చేసుకో," అన్నాడు.

"వద్దండీ, నేను పెళ్ళి చేసుకుంటే నా పెత్తల్లికి మళ్ళీ ఇదేగతి పట్టవచ్చు," అన్నాడు రాము.

ధనికుడు నవ్వి, "నీకా భయం వద్దు. నాకు ఒక్కతే కూతురు. నువూ, నీ తల్లీ మా యింటనే ఉండి పోవచ్చు," అన్నాడు.

రాము పెళ్ళికి ఒప్పుకున్నాడు. —వేమూరు వెంకయ్య.





# బంగారం దొరికింది!

ఒక ఇంట్లో మూడు వాటాలు ఉన్నాయి. ఒక వాటాలో వరదాచారి అనే పంతులు ఉంటున్నాడు. ఇంటివద్ద అతను పాతిక మంది పిల్లలకు పాఠాలు చెబుతూ ఉంటాడు.

రెండో వాటాలో జోగిరాజు అనే భక్తుడు ఉన్నాడు. అతని ఇంట రోజూ భజనలూ, పురాణ కాలక్షేపమూ, బోధలూ ఉంటాయి.

మూడో భాగంలో ఉన్న వెంకటయ్యకు ఉద్యోగం లేదు గాని, అతని భార్య వంటి మీదికి ప్రతి శనివారమూ దేవుడు వచ్చి, ప్రశ్నలు అడిగిన వారికి ఆవిడ ద్వారా సమాధానాలు చెబుతాడు. ప్రశ్నలు అడిగే వారి దగ్గర వెంకటయ్య ప్రశ్నకు రెండేసి రూపాయల చొప్పున వసూలు చేస్తాడు. అయినా శనివారం వచ్చేసరికి అతని ఇల్లు జనంతో కిటకిటలాడుతూనే ఉంటుంది.

ఆ ఇంటికి మంచినీటి సౌకర్యం లేదు. అందుచేత, మంగయ్య అనేవాడు చెరువు నుంచి నీరు తెచ్చి మూడు వాటాల వాళ్ళకూ పోస్తాడు. మంగయ్య ఎటూ ఎవరూ లేని ఒంటరిగాడు.

పార్వతి అనే మనిషి మూడు వాటాల లోనూ పాచిపని చేసి, తన రోగిష్ఠి తండ్రిని పోషిస్తున్నది.

ఒక శనివారం సాయంత్రం, పార్వతి గిన్నెలు కడిగి, వెంకటయ్యగారి వంట గది గుమ్మంలో బోర్లిస్తున్నది. రోజల్లా నోరు పడిపోయేలా ప్రశ్నలకు జవాబులు చెప్పిన వెంకటయ్య భార్య నీరసంగా చాప మీద పడుకుని ఉన్నది. భక్తులు తెచ్చిన పళ్ళూ, కొబ్బరిచిప్పలూ బుట్టలో సర్దుతున్నాడు వెంకటయ్య. త్వరలోనే, చీకటి పడగానే, అతను వాటిని అమ్ముకుని వస్తాడు.

మాచిరాజు కామేశ్వరరావు



వెంకటయ్య సర్దే పళ్ళను అన్నిటిని చూడగానే, పార్వతికి మంచాన పడి వున్న తన తండ్రి జ్ఞాపకం వచ్చాడు. ఆమె ఉండబట్టలేక, ''బాబుగారూ, కొనా లంటే చాలా ప్రియం! రెండు పళ్ళు ఇచ్చారంటే మా నాన్నకు తినిపిస్తాను! రోగిష్ఠి మనిషి!'' అని బతిమాలింది.

వెంకటయ్య చప్పున బుట్టమీద గుడ్డ కప్పి, ''నీ పాపిష్ఠి కళ్ళు పడ్డ పళ్ళకు ఈ రోజు ఏం ధర పలుకుతుందో చూడాలి!'' అన్నాడు.

నీరసంగా ఉన్న వెంకటయ్య భార్య లేచి కూర్చుని, ''నీకు జీతం కాక, పళ్ళూ, ఫలహారాలూ కూడా కావాలా? ఆశకు అంతుండాలి! ఫో, ఫో!'' అని కసురు కున్నది.

అయితే అంతక్రితమే ఆమె ఒక మనిషితో, ''ఆశవల్లే నువ్వు యీ అనర్థం తెచ్చు కున్నావు! దురాశ పనికిరాదు!'' అని ఉండటం జ్ఞాపకం వచ్చి, పార్వతి నవ్వుకున్నది.

అదే సమయంలో మంగయ్య వరదా చారి వాటాలో ఉన్నాడు. వరదాచారి కొడుకు చదివేసిన పుస్తకాలు, తాను ఎరిగిన ఒక బీద విద్యార్థికి ఇప్పించాలని మంగయ్య ఉద్దేశం. వరదాచారి ఒకప్పుడు విద్యార్థులతో, ''అన్ని దానాలలోకీ విద్యా దానం గొప్పది,'' అనటం మంగయ్య విని ఉన్నాడు కూడానూ.

మంగయ్య వరదాచారికి ఆ బీద విద్యార్థి గురించి చెప్పి, ''మీ అబ్బాయికి ఇక అవసరం లేని ఆ పుస్తకాలు ఇస్తే, పాపం ఆ బీదవిద్యార్థి చదువుకుంటాడు,'' అన్నాడు.

''ఇది మరీ బాగుందిరోయ్! దురాశ కాకపోతే, బీదవాడికి చదువెందుకు, కూలిపని చేసుకోక? పుస్తకాల ఖరీదు సగమైనా ఇచ్చుకోమను,'' అన్నాడు వరదాచారి.

అది సాధ్యంకాదని, మంగయ్య ఇవ తలికి వచ్చేస్తుంటే, వెంకటయ్య వాటాలో



నుంచి వస్తున్న పార్వతి ఎదురు పడింది. ఇద్దరూ ఒకరి విషయం ఒకరికి చెప్పుకున్నారు.

"ఈ విషయాలకేం గాని, రేపు పక్క ఊళ్ళో జాతర! వెళదామా?" అన్నది పార్వతి.

"ఇక్కడ పని ఎవరు చేస్తారు?" అన్నాడు మంగయ్య.

"చీకటితో వచ్చి చేసి పోదాం. సాయంకాలం రావద్దు. జోగిరాజుగారు భక్తిగలవాడు. ముందు ఆయన అనుమతి తీసుకుందాం," అన్నది పార్వతి.

"అవును. రోజులో పావుభాగం దేవుడి గుడిలో దైవచింతనలో గడపాలని ఆయన అనడం నేను విన్నాను," అన్నాడు మంగయ్య.

అయితే జోగిరాజు వాళ్ళు జాతరకు వెళ్ళడానికి అనుమతి ఇయ్యకపోగా, "మీకు ఆశ ఎక్కువ! పని చెయ్యకుండానే మీకు జీతం కావాలి! ఒక్కపూట పని మానినా జీతం విరగగోస్తాను! దేవుడి కోసం ఎక్కడికో పోవాలా ఏం? ఆయన ఎక్కడబడితే అక్కడే ఉన్నాడు," అన్నాడు.

ఇద్దరూ బయటికి వచ్చారు.

"ఈ పెద్దవాళ్ళు చెప్పేదానికీ, చేసేదానికీ పోలికే ఉండదు!" అన్నది పార్వతి కోపంగా.

మర్నాడు ఉదయం మసక వెలుతురులో నీళ్ళు తెస్తున్న మంగయ్యకు ఆ లోగిలిలో ఏదో మెరుస్తూ కనిపించింది. కావిడి దించి, మంగయ్య దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. అదొక బంగారు ఉంగరం.

అప్పుడే పాచిపనికి వస్తున్న పార్వతికి మంగయ్య ఆ ఉంగరాన్ని చూపించి, "దొరికింది!" అన్నాడు.

దంతధావనం కోసం బయటికి వస్తున్న వెంకటయ్య, "దొరికింది!" అన్నమాట చెవిని పడేసరికి, గబగబా దగ్గిరికి వచ్చి, ఉంగరం చూసి, "అరె, ఇది నాదే!

భక్తులు ఎవరో కానుకగా ఇచ్చారు. నా వేలినుంచి జారిపోయినట్టుంది. ఇలాతే!'' అన్నాడు.

అతని వెనకే వచ్చిన అతని భార్య, ''అవును, భక్తితో ఇచ్చిన ఉంగరం ఎందుకు పోతుందీ? అందుకే దొరికింది!'' అన్నది.

ఈ అడావుడికి ఇవతలికి వచ్చిన వరదాచారి సంగతి తెలుసుకుని, ''ఆ ఉంగరం నా శిష్యులు నాకు గురుదక్షిణగా ఇచ్చినది! ఇలా ఇయ్యి,'' అన్నాడు.

''పగలంతా చేతికి పెట్టుకు తిరిగారు! జారిపోయి ఉంటుంది!'' అన్నది వరదాచారి భార్య.

గుమ్మంలో నిలబడి అంతా చూస్తున్న జోగిరాజు చప్పున ముందుకు వచ్చి, ''పక్కవూరిలో రామాయణ పారాయణ చేసినప్పుడు ఆ ఊరివాళ్ళు చందాలు వేసుకుని నాకు చేయించి ఇచ్చారు. అది నాదే! ఇలా ఇచ్చెయ్యి!'' అన్నాడు.

''దేవుడి పేరుమీద ఇచ్చినది! ముట్టుకుంటే కళ్ళుపోతాయి!'' అన్నది అతని భార్య.

ఎవరిమటుకు వారు ఆ ఉంగరం తమదేనంటూ కేకలు పెట్టుతూ, మంగయ్య మీదికి ఎగబడ్డారు. దాన్ని ఎవరి చేతిలో పెట్టాలో మంగయ్యకు తెలియ లేదు. పార్వతి చప్పున మంగయ్య చేతిలో నుంచి ఉంగరాన్ని తీసుకుని, ''నిన్న



రాత్రి కామయ్య కల్లుపాకకు ఎవరు వెళ్ళారో వారిదే ఈ ఉంగరం! ఇది మంగయ్యకు కల్లుపాకలో దొరికింది," అన్నది.

ఈ మాటకు అందరూ తెల్లమొహాలు వేసి, ఉంగరాన్ని తిప్పి తిప్పి చూసి, "పొరపాటు పడ్డాం! ఇది మాది కాదు.... అచ్చం ఇటువంటిదే మా దగ్గిరా ఉన్నది! ....పెట్టెలో పెట్టి మరిచిపోయి ఉంటాం," అంటూ చల్లగా జారుకున్నారు.

వాళ్ళు వెళ్ళగానే పార్వతి విరగబడి నవ్వింది.

"ఉంగరం కల్లుపాకలో దొరికిందని ఎందుకు అబద్ధం చెప్పావు?" అని మంగయ్య ఆమెను ఆశ్చర్యంగా అడిగాడు.

"నువు వట్టి అమాయకుడివి! మనుషుల నైజం పసిగట్టలేవు ఈ ఉంగరం వారిది ఎవరిదీ కాదని రూఢి చేసుకోవడానికి అలా అబద్ధం ఆడాను. పరువు కోసం పాకులాడే వీళ్ళు తాము కల్లుపాకకు వెళ్ళామని అనగలరా? అంతకన్న ఘోరమైన పనులే చెయ్యగలరు! వీళ్ళ స్వార్థం చూస్తే అసహ్యం వేస్తున్నది. పైగా ఇతరులను ఆశపోతులంటారు! ఈ ఉంగరం తాలూకు మనిషి ఎవరో తెలిసేదాకా ఇది నీదే! నలుగురు వచ్చే, పోయే లోగిలి గద! ఎవరి చేతి నుంచో జారిపడి ఉంటుంది!' అంటూ పార్వతి ఉంగరాన్ని మంగయ్య చేతిలో పెట్టింది.

"అవును, నాకు తెలివిలేదు. నీ వంటి తెలివైన అమ్మాయి నాకు తోడు ఉంటేనే గాని ఈ లోకంలో బతకటం కష్టం. నీకు ఇష్టమైతే దీన్ని నీ వేలికి పెడతాను!" అన్నాడు మంగయ్య నవ్వుతూ.

పార్వతి కొంచెం సిగ్గుపడి, "మా నాన్నను అడుగుదాం!.... ఇంతకూ ఇది అసలు బంగారమో, కాదో!" అన్నది.

"ఇత్తడి అయితేనేం గాక! దాని ధర్మమా అంటూ నాకు నిజమైన బంగారం దొరికింది!" అన్నాడు మంగయ్య, పార్వతి కేసి ప్రేమగా చూస్తూ.





# నగలమోజు

రాజమ్మకు నగల మీద మోజు ఎక్కువ. ఆమె తన ఒంటి నిండా నగలు దిగవేసుకునేది. కాని ఎంత అవసరం వచ్చినా తన నగ ఒక్కటి కూడా ఇతరులకు అరువు ఇచ్చేది కాదు.

రాజమ్మ అన్నగారైన సుబ్బయ్య కూతురి పెళ్ళి వచ్చింది. సుబ్బయ్య పెద్ద భూస్వామీ, ధనవంతుడూనూ. రాజమ్మ పెళ్ళికి వెళ్ళింది.

ముహూర్తం దగ్గిర పడుతుండగా సుబ్బయ్య రాజమ్మను చాటుకు పిలిచి, "చెల్లెమ్మా, నీ వల్ల చిన్న ఉపకారం కావాలి. అమ్మాయికి కావలసిన పెళ్ళి నగలు చెయ్యమని పొరుగూరి కంసాలికి పదిరోజుల క్రితమే డబ్బిచ్చాను. కాని ఇంత వరకూ నగలు రాలేదు. ముహూర్తం దగ్గిర పడుతున్నది. అమ్మాయి ఒంటి నిండా నగలు లేకుండా పెళ్ళిపీటల మీదికి తీసుకు రావటం ఏమీ బాగుండదు. అందుచేత అమ్మాయికి నీ ఒంటిమీది నగలు పెట్టి, స్వయంగా నువ్వే, దాన్ని పీటలమీద కూర్చో బెట్టు. పెళ్ళి అయిపోగానే నీ నగలు తీసుకోవచ్చు!" అన్నాడు.

అలా చెయ్యటానికి రాజమ్మ మనసు ఒప్పక, "అన్నయ్యా, నా ఒంటిమీది నగలు బంగారువి అయితే, పోనీ నువు అన్నట్టు, అమ్మాయికి అలంకరించడానికి నాకేం అభ్యంతరం? కాని నావి అన్నీ గిల్టు నగలు! ఆ సంగతి నీకు తెలిసినట్టు లేదు. పెళ్ళి కూతుర్ని గిల్టునగలతో అలంకరించడం అశుభం అంటారు గదా!" అని తెలివిగా అబద్ధం చెప్పి తప్పించుకున్నది.

సుబ్బయ్య రాజమ్మ మాట నిజమని నమ్మాడు. కాని అతను మరో పద్ధతి

శరత్

ఆలోచించే లోపల కంసాలి వచ్చి, నగలు అందజేశాడు.

అనుకున్న ముహూర్తానికి పెళ్ళి నిరాటంకంగా జరిగిపోయింది.

ఆ రాత్రి పెళ్ళికి వచ్చిన బంధువులందరూ సుబ్బయ్య ఇంటనే ఉండిపోయారు. మర్నాడు తెల్లవారి గాని ఎక్కడివారు అక్కడికి వెళ్ళిపోవటం జరగదు.

రాత్రి భోజనాలు అయాక రాజమ్మా, మరి ఇద్దరు దూరపు బంధువులూ ఒక గదిలో పడుకున్నారు.

అర్ధరాత్రి వేళ దొంగలు ఆ గదిలోనే ప్రవేశించి, అలికిడికి నిద్రలేచిన రాజమ్మనూ, మిగతా యిద్దర్నీ, కిక్కురుమంటే పొడిచేస్తామని కత్తులతో బెదిరించి, ముగ్గురు ముత్తయిదువుల ఒంటిమీద ఉన్న నగలన్నీ, మిగల్చకుండా ఊడ్చుకుని పారిపోయారు.

దొంగలు వెళ్ళిపోయే దాకా ప్రాణాలు బిగబట్టుకుని, రాజమ్మ గుండె చెరువయేలాగా భోరున ఏడవసాగింది. ఆమెతో బాటు నగలు పోగొట్టుకున్న మిగిలిన ఇద్దరూ కూడా అదేపనిగా పెడబొబ్బలు పెట్టసాగారు.

ఈ అల్లరికి పెళ్ళికి వచ్చిన బంధువులందరూ నిద్రలేచారు.

సుబ్బయ్య ఏం కొంప మునిగిందోనని ఆందోళన పడుతూ వచ్చి జరిగినది తెలుసుకుని, నగలు పోగొట్టుకున్న వాళ్ళతో, "అమ్మా, మీరేమీ విచారించకండి. నా యింట పోగొట్టుకున్న సొత్తుకు పూచీ నాది! మీ నగలు ఏవేవి పోయాయో వివరాలతో సహా ఇస్తే అలాటి నగలే చేయించి ఇస్తాను!" అని తన చెల్లెలి కేసి తిరిగి, "చెల్లెమ్మా! నీలాగే మిగిలిన వాళ్ళవి కూడా గిల్టునగలు అయి ఉంటే, నాకు ఈ అనవసరపు ఖర్చు తప్పేది గద!" అన్నాడు.

ఈ మాట వినగానే రాజమ్మ ముఖం నల్లబడింది. ఆమెకు నోట మాట రాలేదు.





# దేవీ భాగవతం

హరిశ్చంద్రుడు తలపెట్టిన నరమేధం విశ్వామిత్రుడి ధర్మమా అంటూ సుఖాంతం అయినాక, ఒకనాడు ఇంద్రుణ్ణి చూడటానికి ఇంద్రసభకు వసిష్ఠ, విశ్వామిత్రులిద్దరూ వచ్చారు. వసిష్ఠుడి వంటి మీద అనేక బహుమానాలుండటం చూసి విశ్వామిత్రుడు ఆశ్చర్యంతో, ''ఎవరు నిన్ను ఇంతగా సన్మానించారు?'' అని అడిగాడు.

వసిష్ఠుడు గర్వంతో కూడిన సంతోషంతో, ''చంద్రుడి లాంటి సత్యహరిశ్చంద్రుడు మా శిష్యుడేగా! అతనికి సరి వచ్చే రాజులు ఎవరున్నారు గనక? రాజసూయ యాగం చేసి, అంతులేని దక్షిణలిస్తూ, నన్ను సత్కరించాడు! నిజం చెప్పటంలో గాని, దాతృత్వంలో గాని, శౌర్యంలో గాని, ధర్మాచరణలో గాని ఏ యుగంలోనూ, పధ్నాలుగు లోకాలలోనూ హరిశ్చంద్రుడితో పోలగల రాజు లేడు,'' అంటూ హరిశ్చంద్రుణ్ణి తెగ పొగిడాడు.

వసిష్ఠుడు హరిశ్చంద్రుణ్ణి ఆకాశానికెత్తటం చూసి విశ్వామిత్రుడికి మండుకొచ్చి, ''వట్టి అబద్ధాల కోరునూ, కపటినీ ఇంత గొప్ప చేసి చెబుతావేమిటి? ఈ హరిశ్చంద్రుడు వరుణుణ్ణి మోసగించలేదూ? ఈ కబుర్లకేం? పందెం ఒడ్డి నిరూపిస్తాను, హరిశ్చంద్రుడు అసత్యవాది, దుర్మార్గుడు, దాత కాడు! అలా నిరూపించలేకపోతే నా పుణ్యమంతా

**26. హరిశ్చంద్రుడి కష్టాలు**



నశించిపోవాలి ; నిరూపిస్తే నీ పుణ్యం నశించటానికి ఒప్పుకుంటావా?'' అన్నాడు.

ఇద్దరిమధ్యా మాటా, మాటా పెరిగింది. పంతం కొద్దీ ఇద్దరూ పందెం ఒప్పుకుని, తమతమ ఆశ్రమాలకు తిరిగివచ్చారు.

ఒకనాడు హరిశ్చంద్రుడు అరణ్యంలో తిరుగుతూ ఒక స్త్రీని చూశాడు. ఆమె ఘోరంగా ఏడుస్తున్నది. ఆమెను చూసి జాలిపడి హరిశ్చంద్రుడు, ''ఈ భయంకరమైన అరణ్యంలో నువు ఒంటరిగా ఎందుకున్నావు? నీ భర్త ఎవరు? నా రాజ్యంలో క్రూరులూ, రాక్షసులూ లేరు. నీకు దుఃఖం కలిగించిన వాడెవడో చెబితే వాడి అంతు చూస్తాను,'' అన్నాడు.

హరిశ్చంద్రుడు అడిగిన దానికి ఆ స్త్రీ ఇలా జవాబు చెప్పింది :

''రాజా, విశ్వామిత్రుడు అనే ముని నా కోసం తపస్సు చేస్తూ నన్ను బాధ పెట్టుతున్నాడు.''

ఆ మాట విని హరిశ్చంద్రుడు, ''నువు విచారించకు. నిన్ను తన తపస్సుతో బాధ పెట్టుతున్న ఆ విశ్వామిత్రుడి చేత తపస్సు మాన్పిస్తాను,'' అని ఆమెకు మాట ఇచ్చి విశ్వామిత్రుడి ఆశ్రమానికి వెళ్ళి, ఆయనతో, ''మహామునీ, ఎందుకు తపస్సు చేసి, దేహపీడకు గురి అవుతావు? నేను రాజ్యం చేస్తూండగా, పాపబుద్ధితో లోకపీడ కోసం ఇలా తపస్సు చెయ్యటానికి వీలులేదు. ఈ పని మాను! ఇందువల్ల పుణ్యమా? పురుషార్థమా?'' అన్నాడు.

విశ్వామిత్రుడు ఆ ప్రదేశం విడిచి ఇంకెక్కడికో వెళ్ళిపోయాడు. ఇదివరకు వసిష్ఠుడితో తాను ఘర్షణపడిన మీదట ఇప్పుడు హరిశ్చంద్రుడు తన తపస్సు నిలుపు చెయ్యటంతో విశ్వామిత్రుడి ఆగ్రహం మిన్ను ముట్టింది. ఆయన హరిశ్చంద్రుణ్ణి మోసం చెయ్య నిశ్చయించి, ఒక రాక్షసుణ్ణి పంది రూపంలో పంపకం చేశాడు. అది హరిశ్చంద్రుడి ఉపవనంలో వచ్చిపడి అక్కడి భటులను అడలగొట్టి, పూలమొక్కలన్నిటినీ

ధ్వంసం చేసింది. మాలలు కట్టేవాళ్ళు దాన్ని బాణాలతో కొట్టినా అది చలించ లేదు. అది మామూలు పంది కాదని తెలుసుకుని, వాళ్ళు పారిపోయి రాజుతో మొర పెట్టుకున్నారు.

హరిశ్చంద్రుడు గుర్రం ఎక్కి, కొందరు సైనికులను వెంట బెట్టుకుని, ఉపవనానికి వెళ్ళి, దూరంగా గుర్రు గుర్రు మంటున్న పందినీ, అది ధ్వంసం చేసిన పూలమొక్కలనూ చూసి, కోపం ఆపుకోలేక, దాని మీద బాణాలు కురిపించాడు. అది చావకపోగా, కనబడుతూ, అదృశ్యమవుతూ, హరిశ్చంద్రుణ్ణి నానా తిప్పలూ పెట్టింది. చివరకు అది అరణ్యంలోకి పారిపోతుంటే, హరిశ్చంద్రుడు దాన్ని వెంటతరిమాడు.

పోగా, పోగా అరణ్యమధ్యంలో ఒక సెలయేరు తగిలింది. అడవిపంది జాడ లేదు. హరిశ్చంద్రుడు తన గుర్రాన్ని నీరు తాగించి, తాను తాగి, తిరిగి పోవటానికి దారి ఏదా అని ఆలోచిస్తూండగా, విశ్వామిత్రుడు అక్కడికి వృద్ధబ్రాహ్మడి రూపంలో వచ్చాడు. హరిశ్చంద్రుడు నమస్కరించగా విశ్వామిత్రుడు దీవించి, "రాజువు గదా, నిర్జనమైన ఈ ప్రదేశానికి ఒంటరిగా ఎందుకు రావలసి వచ్చింది?" అని అడిగాడు.




హరిశ్చంద్రుడు వృద్ధబ్రాహ్మణ రూపంలో ఉన్న విశ్వామిత్రుడికి, పంది విషయమంతా చెప్పి, "తిరిగి పోవటం ఎలాగో తెలియటం లేదు. దయచేసి దారి చెప్పండి!" అని అడిగాడు.

దానికి విశ్వామిత్రుడు, "రాజా, ఇది ఒక పుణ్యతీర్థం. ఇందులో స్నానం చేసి, పితృదేవతలకు తర్పణాలు వదిలి, శక్తి కొద్దీ దానధర్మాలు చెయ్యాలి. నీకు తోచినది నాకు దానం ఇచ్చావంటే, నీకు దారి చూపుతాను!" అన్నాడు.

దానికి హరిశ్చంద్రుడు ఇలా అన్నాడు:

"స్వామీ, నువు ఏది కోరితే అది దానం ఇస్తాను. ఏం కావాలి? బంగారమా,



ఆయన మాయతో ఒక పదేళ్ళపిల్లనూ, ఒక యువకుణ్ణీ సృష్టించి తెచ్చి, "వీళ్ళే పెళ్ళి కావలసిన వధూవరులు. వీళ్ళకు పెళ్ళి చేస్తే రాజసూయ యాగం చేసిన దానికన్న ఎక్కువ పుణ్యం!" అన్నాడు.

హరిశ్చంద్రుడు సరేనని ఒప్పుకుని, ఆ ముసలిబ్రాహ్మడి రూపంలో ఉన్న విశ్వామిత్రుడు చూపించిన దారిన తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

విశ్వామిత్రుడు తన ఆశ్రమానికి వచ్చి, ఆ వధూవరులకు పెళ్ళిచేసి, హరిశ్చంద్రుణ్ణి చూడబోయే సరికి అతను అగ్ని గృహంలో ఉన్నాడు.

"మంచి సమయానికే వచ్చాను. నాకు ఇస్తానన్న దానం ఇచ్చెయ్యి," అన్నాడు వృద్ధబ్రాహ్మణ వేషంలో ఉన్న విశ్వామిత్రుడు.

"నువు ఏది కోరుకుంటే అదంతా ఇస్తాను. నీ కోరిక చెప్పు," అన్నాడు హరిశ్చంద్రుడు.

"నీకు ఎదురుగా ఉన్న అగ్నిహోత్రుడు సాక్షిగా నీ రాజ్యం యావత్తూ ఏనుగులూ, గుర్రాలూ, మొదలైన సమస్త సంపదలతోనూ, నాకు ఇచ్చెయ్యి!" అన్నాడు విశ్వామిత్రుడు.

హరిశ్చంద్రుడు ముందూ, వెనకా ఆలోచించకుండా, "ఇచ్చాను," అన్నాడు.

గుర్రాలా, భూఖండమా, ధనమా? ఇంతకు పూర్వం రాజసూయం చేసినప్పుడు, మునుల సమక్షంలో, ఎవరేది కోరినా ఇస్తానని దీక్షపట్టాను. నువు మహాపురుషుడివి! ఈ తీర్థమూ పవిత్రమైనది. నువు ఏది కోరినా ఇయ్యవచ్చు."

"రాజా, నువు అంత గొప్పవాడివే! సూర్యవంశంలో త్రిశంకుడి కొడుకువై పుట్టిన నిన్ను గురించి నీ అంతటి వాడు లేడని వసిష్ఠుడు కూడా అనగా విన్నాను. అతను అబద్ధమాడతాడా? నువు మహాదాతవు, భూమికంతటికి రాజువు. నా కొడుకు వివాహం జరిపించు," అన్నాడు విశ్వామిత్రుడు.

అప్పుడు విశ్వామిత్రుడు, "దక్షిణలేని దానం వృథా! అందుచేత ఈ దానానికి తగిన దక్షిణ కూడా ఇచ్చి, కృతార్థుడి వికా!" అన్నాడు.

"ఆ దక్షిణ ఎంత ఉంటుంది?" అని హరిశ్చంద్రుడు అడిగాడు.

"రెండు బారువల బంగారం దక్షిణగా ఇయ్యి," అన్నాడు విశ్వామిత్రుడు.

"అలాగే ఇస్తాను," అని హరిశ్చంద్రుడు మాట ఇచ్చాడు.

విశ్వామిత్రుడి కపటం చూసి హరిశ్చంద్రుడికి ఆశ్చర్యం కలిగింది. రాజ్యం ఇచ్చిన తరవాత దక్షిణ కూడా కావాలని ఆయన అంటే అమాయకంగా ఇస్తానన్నాడు. ఉన్నదంతా దానం చేసినాక రెండు బారువల బంగారం ఎక్కడి నుంచి తెచ్చేటట్టు? కాలవైపరీత్యం కాకపోతే, తపస్సు చేసుకునేవాళ్ళు ఎక్కడైనా ధనలోభంతో యితరులను, ఇలా మోసగిస్తారా?

ఈ విధంగా చింతలో మునిగి ఉన్న భర్తను చూసి రాణి, అతని విచారానికి కారణం అడిగింది. హరిశ్చంద్రుడు ఆమెకు క్లుప్తంగా జరిగినది చెప్పి, ఆ రాత్రి భోజనం చెయ్యకుండానే గడిపాడు.

తెల్లవారుతూనే విశ్వామిత్రుడు వచ్చి, "రాజ్యం వదిలి ఎక్కడికైనా వెళ్ళు.



నా కిస్తానన్న దక్షిణ మాత్రం త్వరగా ఇచ్చెయ్యి," అన్నాడు.

"ఉన్నదంతా ఇచ్చాను. వెళ్ళిపోతాను. దక్షిణ ఇప్పుడు ఇచ్చేస్థితిలో లేను గనక, వ్యవధిగా ఇస్తాను," అని హరిశ్చంద్రుడు తన భార్యనూ, కొడుకునూ చూసి, "మనం ఇక్కడ ఉండరాదు, పదండి!" అన్నాడు.

ముగ్గురూ కట్టు గుడ్డలతో బయలుదేరారు. తమ రాజుకు జరిగిన మోసం తెలిసి, పౌరులు కంట తడి పెట్టుతూ, విశ్వామిత్రుణ్ణి తిట్టిపోశారు.

వెళ్ళిపోతున్న హరిశ్చంద్రుణ్ణి వెంట తగిలి విశ్వామిత్రుడు, "నా దక్షిణ ఇచ్చెయ్యి. ఇయ్యటం ఇష్టం లేకపోతే



మైన రాజ్యం ఇప్పుడు నాది! ఇలా వంకర టింకరగా అబద్ధాలాడక, ఇయ్యనని చెప్పెయ్యి, నేను మళ్లా నిన్ను అడగను! ఆ తరవాత నీ యిష్టం నీది!'' అన్నాడు.

హరిశ్చంద్రుడికి రోషం వచ్చింది.

''నేను అబద్ధం ఆడుతున్నానా? డబ్బు గురించి అంత శంకదేనికి? నా శరీరం అమ్మి అయినా నీ బంగారం నీ కిస్తాను. నన్ను పీడించనవసరం లేదు. ఆరోగ్యవంతులం ముగ్గురం ఉన్నాం. కొనేవాడెవడైనా ఈ అయోధ్యలో ఉంటే చూడు. లేదూ, కాశీలో మమ్మల్ని అమ్మి నీ దక్షిణ ఇస్తాను,'' అంటూ హరిశ్చంద్రుడు ముందుకు సాగాడు.

ఇయ్యనని చెప్పు! నేను మరొకసారి అడగను. అంతేకాదు, కావాలంటే నువ్విచ్చినదంతా నీకు తిరిగి ఇస్తా. అలా కాక మాట నిలబెట్టుకోదలిస్తే బంగారం ఇచ్చెయ్యి!'' అన్నాడు.

''అయ్యా, నీ ఋణం తప్పక తీర్చుతాను. లేకుండా అన్నం ముట్టగలనా? నన్ను చూసి అందరూ నవ్వరా? కొంచెం ఆగితే, దైవం అనుకూలించి నాకు దొరికిన ధనం దక్షిణ కింద ఇస్తాను,'' అన్నాడు హరిశ్చంద్రుడు.

దానికి విశ్వామిత్రుడు, ''రాజా, పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. నీకు ధనం ఎక్కడ దొరుకుతుంది? సమస్త ధనానికీ మూల

అందరూ కాశీ చేరారు. హరిశ్చంద్రుడు గంగా స్నానం చేసి, తర్పణాలు విడిచి, తన వెంట బ్రాహ్మణ రూపంలో ఉన్న విశ్వామిత్రుడితో, ''అయ్యా, మా ముగ్గురిలో ఎవరినో ఒకరిని అమ్మి నీ ఋణం తీర్చుకో,'' అన్నాడు.

''నెల రోజులుగా నన్ను నీ వెంట తిప్పుతున్నావు, ఏమైనా న్యాయంగా ఉన్నదా? నా దక్షిణ నా కిచ్చి మరీ కదులు! నీ కీర్తి దక్కుతుంది!'' అన్నాడు విశ్వామిత్రుడు.

''అయ్యా, నెల ఇంకా నిండలేదు. సాయంకాలం దాకా గడువు ఉన్నది

కొంచెం ఆగితే నీ ఋణం తీరుస్తాను,'' అన్నాడు హరిశ్చంద్రుడు.

''వెళ్ళి, మళ్ళీ వస్తాను. నా ఋణం తీర్చకపోయావో శపిస్తాను,'' అంటూ విశ్వామిత్రుడు వెళ్ళిపోయాడు.

సాయంకాలం లోగా రెండు బారువల బంగారం ఇయ్యకపోతే శపిస్తానని భయ పెట్టి విశ్వామిత్రుడు వెళ్ళిపోయాక, హరి శ్చంద్రుడు అయోమయంలో పడ్డాడు. అడిగితే ఇచ్చే సంపన్నులైన మిత్రులుంటే కూడా తాను చెయ్యిచాచలేడు, అటువంటి మిత్రులు లేరు సరేసరి, బ్రాహ్మడి ఋణం తీర్చకుండా తాను చచ్చిపోవటం జరిగితే, బ్రాహ్మణ ధనం అపహరించిన నేరానికి పురుగై పుట్టాలి! అందుచేత తనను తాను అమ్ముకోవటం తప్ప గత్యంతరం లేదు.

ఇలా ఆలోచిస్తూ, విచారంగా ఉన్న భర్తను చూసి హరిశ్చంద్రుడి భార్య శైబ్య, ''రాజా, సత్యవంతుడికి సమానుడు మరె వడూ ఉండడు. మాట తప్పిన వాడు పిశా చంతో సమానం. సత్యం పాలించు. యయాతి నూరు అశ్వమేధాలు చేసి, తరవాత రాజసూయం చేసి, దాని ఫలితంగా స్వర్గానికి వెళ్ళి, ఒక్క అబద్ధం ఆడిన కారణంగా అధోగతి పాలయాడని చెబుతారు!'' అన్నది.

ఆమె మాట విని హరిశ్చంద్రుడు, ''నువు ఏదో చెప్పదలచుకున్నట్టున్నావు. ధైర్యంగా చెప్పెయ్యి!'' అన్నాడు.

దానికి శైబ్య, ''భార్య అనేది సంతానం కోసం. నా నుంచి నీకు ఆ ఫలితం లభిం చింది గదా. నన్ను ఎవరికైనా అమ్మి, ఆ బ్రాహ్మడి ఋణం తీర్చరాదా?'' అన్నది.

ఈ మాటకు హరిశ్చంద్రుడికి, దుఃఖం పొంగి వచ్చింది. ఎంతో ప్రియంగా మాట్లాడి తనను ఆనంద పరిచే భార్య ఇలాటి కఠోరమైన మాటలు అనటం అత నికి విధివైపరీత్యంగా తోచింది. దుఃఖా వేశంతో హరిశ్చంద్రుడికి స్పృహ పోయింది.





# ప్రాయశ్చిత్తం

కైరో నగరంలో పూర్వం ఒక నగల వర్తకుడుండేవాడు. అతను ఇరవై లోపు వయసు గలవాడు. అతని దుకాణానికి తరుచు స్త్రీలే వస్తూండేవారు. వారి వలలో పడిపోతానేమోనని అతను వారికేసి చూడనైనా చూసేవాడు కాడు. అతని ప్రవర్తన చూసి అందరూ మెచ్చుకునే వారు.

ఇలా ఉండగా ఒకనాడతనిదుకాణానికి ఒక నీగ్రో బానిసపిల్ల వచ్చి, ''ఫలానావారి దుకాణం యిదేనా? దుకాణదారు మీరేనా?'' అని అడిగింది. అవునన్న మీదట ఆ పిల్ల అటూ, ఇటూ చూసి అతని చేతిలో ఒక చీటీ పెట్టింది. ఆ చీటీ విప్పి చూసిన దుకాణదారుకు ఆశ్చర్యమూ, కోపమూ కలిగాయి. ఎందుకంటే అందులో ఒక ప్రేమగీతం రాసి వున్నది. ఆఖరు చరణంలో అది రాసిన యువతి పేరు కూడా వున్నది.

నగల వర్తకుడు పర్రున చీటీ చించేశాడు. సమాధానం కోసం కనిపెట్టుకుని ఉన్న బానిసపిల్లను నానా తిట్లూ తిట్టి, దుకాణంలో నుంచి బయటికి గెంటేశాడు. ఇదంతా చూసి చుట్టుపక్కల వాళ్ళంతా, ''ఆహా, ఎంత నీతిపరుడు!'' అంటూ ఆ వర్తకుణ్ణి శ్లాఘించారు.

రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. మంచి కన్య దొరికితే పెళ్ళాడాలన్న అభిలాష నగల వర్తకుడికి కలిగింది. తన దుకాణానికి వచ్చిపోయే యువతులలో అందకత్తే, బుద్ధిమంతురాలూ, కన్యా అయిన పిల్ల ఎవరన్నా దొరుకుతుందా అని అతడు చూడసాగాడు.

ఒకనాడతని దుకాణానికి అయిదారుగురు తెల్ల బానిసస్త్రీలను వెంట బెట్టుకుని ఒక అందమైన యువతి వచ్చి, ''మంచి నగలేమైనా ఉన్నాయా?'' అని అడిగింది.



దుకాణదారు ఉన్నాయని చెప్పిన మీదట ఆమె బంగారు పాజేబులు చూపమన్నది. ఒక బానిస ఆమె పావడా అంచు పైకెత్తి పాదం ప్రదర్శించింది. అంత చిన్న పాదం చూసి దుకాణదారు నిర్ఘాంత పోయి, "నా దగ్గిర వున్న చిన్నపాజేబులు కూడా చాలా వొదులవుతాయి, ఎలాగ?" అన్నాడు.

"అదేమిటి? నావి ఏనుగు కాళ్ళంటారే?" అన్నదా యువతి ఆశ్చర్యపోతూ.

"ఎవరా అనేది? పురుగులు పడి పోతారు. చక్కని గువ్వలాటి పాదం! బుల్లిపాదం!" అన్నాడు దుకాణదారు, పారవశ్యంతో.

"పోనీ, చేతులకు కంకణాలేమైనా ఉన్నాయా?" అన్నదామె. బానిస ఒకతె ఆమె చేతుల మీది బట్ట తొలగించే సరికి దుకాణదారు మరీ నిర్ఘాంత పోయాడు.

"నా దగ్గిర ఉన్న కంకణాలలో అతి చిన్నది కూడా ఈ చేతులకు వొదులవుతుంది," అన్నాడతను.

"అదేమిటి? నా వేళ్ళు అరటి కాయల్లాగా ఉంటాయనీ, చేతులు ఏనుగు తొండాల్లాగా ఉంటాయనీ అంటారే!" అన్నది యువతి.

"అటువంటి మాటలనే వాళ్ళు నాశనమైపోతారు. సుందరీ, నీ వంటి అందగత్తె మూడు లోకాలలోనూ లేదు. నన్ను పెళ్ళాడి ధన్యుణ్ణి చెయ్యవా?" అంటూ దుకాణదారు యువకుడు ఆమె ముందు మోకరించి, కన్నీటి పర్యంతమై పోతూ, వేడుకున్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది. "మా నాన్నకు నేనంటే ఎంతకోపమో! నాది చిగ్రబొచ్చుట, వికారమైన ముఖమట, గొగ్గి పళ్ళుట, మొహమంతా స్ఫోటకం మచ్చలుట! నన్నెవరూ పెళ్ళాడరుట! నేను అందంగా ఉన్నానని నువు చెబితే నాకు నిజంగా సంతోషంగా ఉంది!" అన్నది.

''మీ నాన్నకేదో పిచ్చి అయి ఉంటుంది. ఆయన పేరేమిటో చెప్పు. నే నాయన దగ్గిరికి వెళ్ళి నిన్ను పెళ్ళాడ తానని ప్రమాణం చేస్తాను,'' అన్నాడు దుకాణదారు.

''ఆయన పేరు షేక్ అల్ ఇస్లామ్. ఆయన ఈనగరపు వర్తకులలో ప్రసిద్ధుడు. నువు నన్ను పెళ్ళాడతానంటే ఆయన వెంటనే ఒప్పుకోడు. నా అనాకారితనం వర్ణించి నిన్ను బెదరగొడతాడు. అన్నిటికీ నువు, 'నాకు సమ్మతమే!' అనాలి,'' అన్నదా యువతి.

''నువ్వు చెప్పినట్టే చేస్తాను. నే నాయన్ని ఎప్పుడు కలుసుకునేది?'' అన్నాడు దుకాణదారు.

''రేపు పది గంటలకు,'' అని ఆమె బానిసలతో సహా వెళ్ళిపోయింది.

మర్నాడు ఉదయం పది గంటలకు నగల వర్తకుడు షేక్ అల్ ఇస్లామ్ భవనం ఎక్కడ ఉన్నదీ కనుక్కొని ఆయన్ను చూడబోయాడు.

అల్ ఇస్లామ్ యువకుడి కోరిక విని విచారంగా, ''నీకు నా కుమార్తె సంగతి తెలియదల్లే ఉంది, నాయనా! అది అభాగ్యురాలు. అది పగలు చూస్తే రాత్రి కలలోకి వస్తుంది,'' అని తన కుమార్తె అనాకారితనం చాలాసేపు వర్ణించాడు. ఆయన మాట్లాడుతున్నంత సేపూ యువకుడు, ''నాకు సమ్మతమే! నాకు సమ్మతమే!'' అంటూ వచ్చాడు.





పెళ్ళి అయిపోయింది. నగల వర్త కుడు తన భార్య ఉన్న గదిలోకి వెళ్ళి అమె ముఖం మీద వేసుకున్న మేలి ముసుగు తొలగించి చూశాడు. అతని గుండె ఆగిపోయింది. పెళ్ళికూతురు వట్టి కురూపి. ఇంతకు ముందు దుకా ణానికి వచ్చి నగలు బేరం చేసిన పిల్ల కానేకాదు.

తన కింత ఘోరం ఎందుకు జరిగిందో తెలియక నగల వర్తకుడు తన ఇంటికి తిరిగి వచ్చేశాడు. మర్నాడు తన దుకా ణంలో కూచుని, విచారంలో మునిగి ఉండగా మొదట వచ్చిన యువతి తన బానిసలతో సహా వచ్చి, '' పెళ్ళికొడుకుకు శుభం కలగాలి! సౌఖ్యం కలగాలి!'' అన్నది.

యువకుడామెను తిట్టనారంభించాడు. ఆమె ఆశ్చర్యం నటిస్తూ, '' నేను పంపిన గీతమూ, నా నీగ్రో బానిసపిల్లా జ్ఞాపకం లేవా ?'' అన్నది. ఆమె లేచి వెళ్ళిపోబో తుండగా యువకుడు లేచి, ఆమె కాళ్ళ మీద పడి, '' నాకు బుద్ధివచ్చింది. నన్ను ఎట్లాగయినా ఈ నరకం నుంచి బయట పడెయ్యి, '' అని వేడుకున్నాడు.

ఆమె అతనిని చూసి జాలిపడి అతనికి ఒక ఉపాయం చెప్పి వెళ్ళిపోయింది. ఆమె చెప్పిన ప్రకారం అతను కొన్ని

ఇక చెప్పేదేమీ లేక అల్ ఇస్లామ్ ఆ యువకుడికి తన కుమార్తె నివ్వటానికి సమ్మతించాడు. యువకుడిచేత ఒప్పందం రాయించి సాక్షి సంతకాలు చేయిం చాడు. వధువును వరుడు అన్ని లోపాల తోనూ భార్యగా స్వీకరించేటట్టూ, ఆమెకు ఏ కారణం చేతనైనా విడాకులివ్వగోరే పక్షంలో ఇరవైవేల దీనారాల బంగారం పరిహారంగా చెల్లించేటట్టూ పత్రంలో రాయించాడు.

'' పెళ్ళికూతురు రోగిష్టిది. మంచం దిగలేదు. అందుచేత పెళ్ళి ఇక్కడే జరగాలి!'' అన్నాడు అల్ ఇస్లామ్. మరీ మంచిదన్నాడు నగలవర్తకుడు.

ఏర్పాట్లు ముగించి నేరుగా తన మామ గారయిన అల్ ఇస్లామ్ ఇంటికి వెళ్ళాడు. అక్కడ వసారాలో మామా, అల్లుడూ సుఖాసీనులై ఉండగా, తలవాకిలి తలుపు తోసుకుని అంతులేని అలగాజనం లోపలికి వచ్చారు. కొందరు తప్పెటలు వాయించారు. కొందరు ఈలలు వేశారు. కొందరు సాముగరిడీలు చేశారు. కొందరు కోతులనూ, ఎలుగుబంట్లనూ ఆడిస్తూ అరవసాగారు.

అల్ ఇస్లాం లేచి అరుస్తూ, "ఏమిటీ అల్లరి? ఆపండి!" అన్నాడు. కాని నగలవర్తకుడు ఆగమన్న దాకా వాళ్ళు ఆగలేదు.

తరవాత ఆ యువకుడు అల్ ఇస్లామ్ కేసి తిరిగి. "మామా. వీళ్ళంతా నా బంధువులూ, దాయాదులూనూ! నేను పెళ్ళాడానని తెలిసి, సంబరం చెయ్య వచ్చారు. మరేమీ లేదు!" అన్నాడు.

అల్ఇస్లామ్ తెల్లబోయి, "వీళ్ళా నీ బంధువులు? ఈ సంగతి ముందుగా తెలిస్తే నా పిల్లనివ్వక పోదునే!" అన్నాడు.

"నన్నడిగితే నేను మొదటే చెప్పి ఉందును," అన్నాడు యువకుడు.

"అడక్క పోయినా చెప్పవలసింది. నువు రాసి ఇచ్చిన పత్రం చెల్లదు. నేను ఒప్పను!" అన్నాడు అల్ ఇస్లామ్.

"నేను నా భార్యను చచ్చినా వదలను. మీరేం చేస్తారో నేనూ చూస్తాను," అన్నాడు యువకుడు కోపం నటిస్తూ.

అల్ ఇస్లామ్ కాళ్ళబేరానికి వచ్చి, "బాబూ, బాబూ! నా పరువు కాపాడి తివా, అల్లా నిన్ను కాపాడతాడు. నా కూతురికి విడాకులిచ్చెయ్యి!" అన్నాడు.

బలవంతాన ఇస్తున్నట్టుగా యువకుడు తన భార్యకు విడాకులిచ్చి బయట పడ్డాడు. ఆ తరవాత అతను తాను ప్రేమించిన సుందరిని పెళ్ళాడాడు. ఆమె కైరో సుల్తాను దగ్గిర బంధువురాలని తెలియగానే అతని సంతోషానికి మేరలేక పోయింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.







Brahmdev D. N. Shirke

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మీద పడకుంటే మేలు

రెండవ ఫోటో : ఎదురు రాకుంటే చాలు

పంపినవారు : అమంచర్ల ప్రసాదరావు, దేవరాయపల్లె. (నెల్లూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.




ఫలరస సమృద్ధి
ఫలరస తమాషా

# ఫ్రూట్రైన్

ప్రతి ఒక్కరికీ ఫలరస
హామేషా

# న్యూట్రైన్

కానుక

ఒక్కో ప్యాక్‌లో
పది స్క్వేర్‌లు






**ఒక్కొక్క మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!**

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆం.ప్ర.)

CAS NC/49/80 TE B

# చందమామ కేమెల్

## రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

**P.B. No. 9928, COLABA, Bombay-400 005.**

ఫలితములు తుది నిర్ణయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

**Name** ------------------------------ **Age** ------------

**Address** ------------------------------------------

**దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.**

**CONTEST NO.17**

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

**ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 29-11-1980**

VISION

పార్లే

# మీరు మెచ్చే బిస్కట్లకు నకిలీ చేసేవారి ఆటల్ని, అలా అవలీలగా కట్టించెయ్యవచ్చు

**P-A-R-L-E**
అన్న వర్ణక్రమం
చదివిచూడండి.
P-A-R-L-E అన్నదాన్ని
P-E-R-L-E లేక
P-E-A-R-L అని
G-L-U-C-O అన్నదాన్ని
G-L-U-C-O-S-E అని రాసి
మా బిస్కట్లకు నకిలీ చేసేవారు
మిమ్మల్ని మోసం చేయాలని
ప్రయత్నిస్తారు గనక.

**ఎప్పుడూ గుర్తుంచుకోండి.**
పార్లే మొనాకో, క్రాక్‌జాక్ బిస్కట్లు ఎప్పుడూ విడిగా అమ్మబడవన్నది. మీరు అసలైనవే కొంటున్నారన్న నిర్ధారణ కోసం గాలి చొరబడని రీతిలో ఫ్యాక్టరీలో సీల్ చేయబడ్డ ప్యాకెట్లనే కొనండి. పార్లే గ్లూకో బిస్కట్లు మాత్రం ప్యాకెట్లలోనూ, విడిగానూ అమ్మబడతాయి. ఒకవేళ వీటిని మీరు విడిగా కొనాల్సొస్తే బిస్కట్ పై
**P-A-R-L-E G-L-U-C-O**
వర్ణక్రమం చూసి మరీ కొనండి.

**కాస్త కొరికి చూడండి-**
రుచి చెప్పేస్తుంది అసలైనదో, కాదో. నకిలీ చేసేవాళ్ళు మా ప్యాక్, బిస్కట్లలాగే కనిపించేలా చేయగలిగినా ఎంత తంటాలుపడ్డా, ఆ పార్లే రుచినీ, ఆ ఉత్కృష్టతనీ ప్రతి సృష్టి చేయలేరుగనక.


వరల్డ్ సెలక్షన్
బహుమతిని గెలుచుకున్నది




**ప్రతిదీ ఆ శ్రేణిలోకల్లా అత్యధికంగా అమ్ముడయ్యేదే,**
**నకిలీలెన్నెన్నో– కాని అసలు అసలేమరి**

**పార్లే గ్లూకో పార్లే మొనాకో పార్లే క్రాక్‌జాక్**

everest/80/PP/340-tl